# ROSHINARA

## A HISTORICAL NOVEL

*(Adapted from Babu Kali Kistna Lahiri's Novel.)*



**V. Ramaswamy Sastrulu & Sons**

292, ESPALNADE, MADRAS.

---

**1930.**

# ROSHINARA

**An Adaptation of Babu Kali Kistna Lahiri's Bengalee Novel.**





MADRAS:
V. RAMASWAMY SASTRULU & SONS
292, ESPLANADE ROW,
1930.

శ్రీః

# రోషనార.

వంగభాషయందు శ్రీ కాళీకృష్ణలాహిరిగారు రచియించిన దానికి తెనుఁగు.





చెన్నపురి:
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ
ప్రకటితము.
1930.

# పీఠిక.

---

మామిత్రులలో నొకరు రోషినారా యనునవలను జదివి బాగుగనుండెనని సంతసించి, యీగ్రంథము నాంగ్లేయమునఁ బ్రకటించిన శ్రీయుత రంజనీ రంజన సేనుగారికి భాషాంతరీకరింతుమని వ్రాసిరి. వా రీవిధముగఁ బ్రత్యుత్తరము నిచ్చిరి:—

"DEAR SIR, .... ... ... ... ... .... ... ....

I have no objection to your translating it into your mother tongue, the Telugu language. I am glad to accord the permission as you desire. .... "

I am,
Yours very sincerely,
(Sd) RANJANI RANJAN SEN, B.A., B.L.,
*Pleader and Law Lecturer.*
20—12—15.

---

చిరకాలమునకుఁగాని కారణాంతరములచే నిది భాషాంతరమైనది కాదు.

## గ్రంథచరిత్రము.

ఈగ్రంథము మొదలు 1869 వ-సం॥ రములో ననఁగా నిప్పటికి రమారమియేబదిసంవత్సరములక్రితము వంగభాషలో

రచియింపఁబడినది. అప్పటి కిది రమ్యకథలలో నొకటిగాఁ బరి గణింపఁబడి యట వ్యాప్తినొందెను. రంజనీరంజన సేనుగారి తండ్రి కీనవల సంతసమొనర్ప వారు దీనిని12యేండ్లక్రిత మాంగ్లే యమున కనువాదించిరి. వీరు పలుభాషలలోఁ బండితులగుట యేగాక సుప్రసిద్ధులైన సారస్వతసంపాదనమొనరించిన పండి తులు. ఈగ్రంథమును వా రాంగ్లేయమునఁ బ్రకటింపక పూర్వమే మరణించిరి వారిపుత్త్రులు "వెనెజుడేరివ్యూ" అను పత్రికలో దీనిఁ బ్రకటించిరి. కీర్తిశేషులగు శ్రీనవచంద్ర సేను గారు దీని నాంగ్లేయమున రచియించినారు.

## గ్రం థ క ర్త జీ వి త ము.

వివరములు వ్రాయవిరమించితిమి. మనదేశమునందలి ఫరిద్ పూరు మండలవాసియగు నొకయువకుఁడు దీనిని వంగభాషలో రచియించెను. ప్రజ్ఞావంతులగు కవిపుంగవుల కష్టజీవితములనెఱిఁ గిన లోకమున కతనివిపులచరిత్రమును జెప్పుట చర్వితచర్వణమే యగును. లక్ష్మీసరస్వతులకలహము కవులకడనే యెక్కువగ సిద్ధించును. ఒక సంపన్న బ్రాహ్మణగృహమున జన్మించిన యాగ్రంథకర్త 1871 సంవత్సరమునకుఁ బూర్వమే దీనిని ము గించెను అప్పటి కతనివయస్సిరువదినాలుగేండ్లు మాత్రమే. ఈ గ్రంథము వంగభాషలోఁ బ్రకటింపఁబడిన రెండేండ్లకే యాతఁ డీలోకమున నీకావ్యకన్యను దండ్రిలేనిదానిగఁ జేసిపోయెను. ఇది యొక్కటియే యాతఁడు వంగసరస్వతీకిరీటమున గూర్చిన మాణిక్యమనియు నది చాలవిలువగలరత్నమనియు నాదేశజు

లెంచుదురనుటయుఁ గూడ మనకు విచారకరము. శ్రీయుత మధుసూదనదత్తువంటి వంగకవిశేఖరు లనేకులవలెనే యీతఁడు పాపము తగినమందుమాకులు లేక మరణించెననియు నదియు నాకస్మికమనియు నాదేశస్థు లీకవికొఱకుఁ గన్నీరు విడుతురు. ఈకవిపేరు శ్రీయుత కాళీకృష్ణలాహిరి.

గ్రంథవిషయముకంటె గ్రంథకర్త జీవితముయెడఁ గరఁగినహృదయముగల మామిత్రుఁ డీగ్రంథమును భాషాంతరీకరించి మాకొసఁగెను.

గ్రంథమునందలి మంచిచెడ్డలు పాఠకులకు విశదము. శివాజీపాత్ర మాంధ్రులెఱిఁగిన దానికి విరుద్ధముగ నిందు చిత్రింపఁబడినది. రోషినారా నాతఁడు వొంగలించెననుట కీదినములలో నెవ్వరునంగీకరింపరు. ఐనను మూలగ్రంథమునందలి కథకాని పాత్రవిశేషములఁగాని యిందు మార్పలేదు. కేవలము కథాక్రమమునందలి ప్రకరణవిభాగము మార్చి కొన్నిచోట్ల దండాన్వయముగ మామిత్రుఁడు వ్రాసెను. కావున నిది యానవల కనుసరణము.

ఇట్లు బుధవిధేయులు,
వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

శ్రీరస్తు.

# రోషినారా.

## మొదటి ప్రకరణము.

---

### కొండలోయ.

ఇప్పటికి రమారమి రెండువందలయేండ్లకుఁ బూర్వ మొక నాఁడు మధ్యాహ్నము కొందఱు సిపాయీలొక యందమైన పాలకివెంటఁ బ్రయాణ మొనరించుచుండిరి. వా రార్యావర్తము నుండి దక్షిణాపథమునకుఁ బోవుచుండిరి. అది శీతకాలము. కొందఱుసిపాయీలు గుఱ్ఱముల నెక్కిరి. కొందఱు గజములపై వచ్చుచుండిరి. మఱికొందఱు నడుచుచుండిరి. మింట మార్తాండుఁడు చండకిరణములతోఁ బ్రకాశించుచుండెను. కిరణసమూహముచేఁ బ్రపంచమును దహన మొనరించుచుండెను. సిపాయీలు వేఁడిమికోర్వఁజాలక క్షుత్పిపాసాబాధితులై మిక్కిలి యలయుచుండిరి. ఇంతలో నొకసిపాయీ యిట్లని హీనస్వరమునఁ బలుకఁదొడంగెను. "మిత్రులారా! మన మిట్లాగకుండఁ బ్రయాణము సాగించినచో, మనము బడలికఁ జెందుదుము. ఎండ మండుకొనిపోవుచున్నది. ఆ కనఁబడుచున్న గుట్టలకడఁ గాన్పించుపర్వతపంక్తికడకుఁ బోయి, యాలోయన చల్లని మేఘముల ననుకరించు నానీడల విశ్రమింపవలయును. చల్లఁబడిన పిమ్మట మరల మనము ప్రయాణము సాగించినను మనగమ్యస్థానమును జేరలేకపోము. కావున మనమాలోయలోనికిఁ బోవుదము, విశ్రమింపవచ్చును." ఈమాట లందఱు నంగీకరించిరి.

వారు లోయవైపునకుఁ బయనమై యచిరకాలములో నచ్చటికిఁ జేరిరి. వారచ్చట నాఁగి యెండతగ్గువఱకుఁ గనిపెట్టుకొని యుండిరి.

కొంతవడికిఁ జల్లఁబడఁగా బాటసారులు మరల పాలకి నెత్తించి ప్రయాణము సాగించిరి. సూర్యుఁ డపరాంబుధిని గ్రుంకుచుండెను. వారు పోవుచున్న దారి క్రమముగా సన్న గిలి పర్వతశిఖరపరివృతమగుకొండలలో నదృశ్యమయ్యెను. వారెట్లో ఱాళ్లుఱప్పలు గడిచి పోవుచుండ నింతలో చీఁకటి పడెను. వారందఱు నొకభయంకరదుర్గమునఁ జిక్కుకొనినట్లు వారికిఁ దోఁచెను. దారి కనఁబడదు. ఎటుఁబోవుటకుఁ దెలియదు. సిపాయీలు కడుజాగరూకతతోఁ బొండని బోయీలను హెచ్చరించుచుండిరి. ఆచక్కనిపాలకిని మోయుచున్న బో యీలు పడిపోకుండ నాఱాళ్లలో భద్రముగ నడుగులిడుచుం డుటచే నడక తగ్గినది. వారు చాలదూరము సాగిపోలేదు. ఇరువురు మనుష్యులైనఁగలసి పోవుటకు వీలులేని సన్ననిలో యలో వారు పోవలసివచ్చెను. ఆదారి మిక్కుటముగ మిట్టు పల్లములు కలది. అక్కడక్కడఁ బడిపోయిన జీర్ణవృక్షములు కత్తులువంటి ఱాళ్లకంటె నధికముగఁ గష్టములొదవించు చుం డెను. అటునిటు నల్లుకొని పోయిన యడవితీఁగెలు వారునడు చుటకు దుష్కరమగునట్లు చిక్కులొదవించుచుండెను. బో యీలు నేర్పరులగుటచే నెట్లో నాచిక్కులఁ గడచిపోవుచుం డిరి. తాము మోయుచుండినయమూల్య వస్తువును కడుజాగ రూకతతోఁ దీసికొనిపోవుచుండిరి. దారి సన్నమగుటచే సిపా యీలగుంపు వెనుక వచ్చుచుండెను. కష్టము లెన్నియైన, లెక్కఁ

గొనక బాటసారులు పోవుచుండిరి. రాత్రి జాముగడచెను. ఇంతలో నెచ్చటనుండియో కొందఱాయుధపాణు లారంగమున కు వచ్చిరి. వారు భూమిలోనుండి యాకస్మికముగ పుట్టినట్లుండెను. వారు సులభముగ బోయీలకడఁ బాలకిని లాగి తీసికొనిరి. వారావిలువ గలపాలకిని దీసికొని చీఁకటిలో నదృశ్యులయిరి బోయీలకేకలు విని భయపడి సిపాయీలు వారిని సమీపించిరి. వారు పాలకి నెట్లయిన రక్షింపవలెనని తలంచిరి. ఇంతలో నాసిపాయీలలో ముందున్నయాశ్వికు నెవ్వరో బల్లెమునఁ గ్రుచ్చివైచిరి. ఆతఁడు శత్రువులకు సాష్టాంగనమస్కారమొనరించువానిం బోలె భూమిమీఁదికిఁబడిపోయెను. మరణించు వారియేడ్పుల వినినతక్కినసిపాయీలు ఱాతివిగ్రహముల వలె కొయ్యబాఱిపోయిరి. అప్పుడు శత్రువులలో నొకరెవ్వరో భీకరముగ నిట్లుగర్జించిరి. "మీరెక్కడనున్నారో యక్కడనే నిలిచియుండుఁడు! ముందున కొకయడుగు వేసితిరా మీప్రాణములు దక్కవు. తొందర చేయకుఁడు! మిమ్ముల నేయపాయము కలుగకుండఁ బోనిచ్చెదము"

దీనికిఁ బ్రత్యుత్తర మిచ్చుట కెవ్వరు సాహసింప లేదు. వారి ప్రక్కనుండిన రాతిబండలవలె నిలువుగ్రుడ్లతోఁ జూచుచుండిరి. వారందఱు మూఁగలై వణఁకుచుండిరి. ఎవ్వరును బ్రత్యుత్తర మీయకుండుటఁ జూచి భీకరస్వరమున మాటలాడినయాతఁడు వికటముగ హేళనాసూచకమగు నవ్వునవ్వుచు "ఆత్మరక్షణార్థము ప్రయత్నింపకుఁడు. మీప్రాణము లేల పోఁగొట్టుకొందురు? మీ యనిర్మలరక్త సేకమున నీపవిత్ర,

భూమిని మైలపఱుప నిష్టములేదు. కిక్కురుమనకపొండు!" అని పలికెను.

"నీవెవ్వఁడవు?" అని సిపాయీలలో నొకఁడు హీన స్వరముతో నడిగెను. "నే నెవ్వఁడనైనను—మీరు తక్షణము వెడలిపొండు. లేనియెడల మీకర్మమును బిమ్మటఁ దప్పించుకొనఁజాలరు." అని భీకరస్వరమున ప్రత్యుత్తర మొసఁగెను.

"అయ్యా! నీమాటలవలన నీవొకసుక్షత్రియవీరుఁడ వని తెలియుచున్నది. నేను మిమ్ములఁ గొన్నిమాట లడుగవలె ననియున్నది కాని భయముచే నడుగ వెనుదీయుచున్నాను. ప్రత్యుత్తర మిచ్చెదరా?" అని సిపాయీలలో నొకఁడడిగెను.

"నీప్రశ్నలకుఁదగినకారణముండినచో—నీవాప్రశ్నల యుత్తరముల నందుటకర్హుఁడవయినచో నంతమాత్రము చేయకపోను," అని భీకరకంఠుఁడు బదులు చెప్పెను. ఈమాటల వలన భయము తీరి "అయ్యా! మాపాలకి యెక్కడనున్నది?" అని సిపాయి యడిగెను.

"ఆపాలకితో మీ కేమిపని యున్నది? ఎక్కడనో యున్నది తక్షణము పాఱిపొండు. లేకుండిన మిమ్ములఁ జంపెదను." అని వీరుఁ డనెను.

"పాలకిలో నుండినకన్య నేఁడు భోజనమైన చేయలేదు. ఆమె బాధలు యోచించుకొనవలసినదే! మేమామెను గమ్యస్థానమునకుఁ జేర్చుట కేర్పడినవారలము. మే మట్లొనరింపవలసి యున్నది. దయచేసి యామె యున్నచోటు నెఱిఁగిం

తురా ? ప్రస్తుతము పరిహాసములకు సమయము కాదు." అని సిపాయీలలో నొకఁ డనెను.

"నేను మీతో పరిహాసము లాడుటకు రాలేదు. మీరు చెప్పుకన్యను మేమెఱుఁగమా ? ఆమె గౌరవమునకుఁ దగినమర్యాదకు లోపము లుండవు. ఆమె మా యాతిథ్యమున నుండుట కిప్పు డేమి యభ్యంతరము చెప్పెదరు? " అని వీరుఁ డనెను.

ఇఁక నాబాలికను రక్షించుట యసాధ్య మని సిపాయీలు దిగులుఁ జెందిరి. వారు గొణుగుకొనుచు నిట్టూర్పులఁ బుచ్చుట విచారకరముగనుండెను. వీరుఁడు వారి జాలిఁబుట్టించునేడ్పుల వినుటకుబదులు వికారముగ నవ్వెను. వీరుని వికృతహాసమునకుఁ గినిసి సిపాయీలలో నొకఁ డిట్లుఱుమెను. "దొంగా ! నీవు మాచక్రవర్తి తనూజాతను ద్రోహమునఁ దీసికొని పోయితివి. తక్షణ మామెను మాకడకుఁ దెమ్ము ! లేనియెడల నీపైఁబగతీర్చుకొనక పోము "

" నీమాట లజాగళస్తనములమాడ్కి నిష్ప్రయోజనములు. " అని వీరుఁడు కొంచెము కోపముతో " మరలఁ జెప్పుచున్నాను. మీరు తక్షణము పారిపొండు ! లేనియెడల నిదిగో నాకత్తియే నేను వాక్శూరుఁడను కానని మీ కెఱిఁగించును." అనెను.

ఈ మాటలు సిపాయీలకడఁ జేయవలసినపని చేసినవి. అందొకఁడు మృదుస్వరమున " మహాప్రభూ ! మీరు మమ్ము

చంపనక్కఱ లేదు. మే మాకన్యకొఱ కెట్టులైన మరణింప వలసినవారలమే ! స్వామీ! ఇంతమంది మే మాకన్యకొఱకుఁ జావవలసి యున్నది. ఇది న్యాయమా ? మేము నాశనము కాకుండ రక్షింపుము. భగవంతుఁడు మిమ్ము రక్షించును. శరణాంటిమి. నీకరుణకుఁ బాత్రులము. దయయుంచి బాలికను కాదు. మీరు మాప్రాణములనే దానముచేసిన జ్లించుదుము. రక్షించుము. ” అని వేఁడుకొనుటను సూచించెను.

“ మీ తేనెమాటలకు మోసపోవువాఁడను కాను. అట్టి మాయమాటలు నాకడ బనికిరావు. వానికి స్వస్తిచెప్పుఁడు. ఏవాని “గజదొంగ ! గజదొంగ ! ” యని మీ తేఁ డనవరతము నిందించుచుండునో యట్టి మీచక్రవర్తికడకుఁ బోయి మీ రాతనితో నాతని ప్రియతనూజాత నేఁడు గజదొంగ :— బందిపోటుదొంగ :— చేతులలోఁ జిక్కియున్నదని చెప్పుఁడు! పొండు!” అని వీరుఁడు పలికి చీఁకటిలో నదృశ్యుఁడై పోయెను.

---

## రెండవ ప్రకరణము.

తాము పలుకరించినవీరుఁడు ప్రత్యుత్తరమిచ్చుట లేనందున నాచీఁకటిలో నాతఁ డదృశ్యుఁ డయ్యెనని వారు తెలిసికొనిరి. ఇంతవఱకు వారు కాఱుచీఁకటులలోనే సంభాషించుకొనుచుండిరి. ఒకరినొకరు చూచుకొన నవకాశము లేదు. వారందఱు క్లేశసముద్రమున మునిఁగిపోయిరి. వారివేఁడికోలు

నకు వీరుఁడు మెత్తపడునని వారనుకొనిరి. ఎట్లయిన బాలికను మరలఁ దీసికొని పోవచ్చునను వారియాశలు వమ్మయ్యెను. ఆవీరునితో మాటలాడినంతసేపును వారి కాయాశ ఉండుటచే వారంతగా బాధనొందలేదు. ఇప్పు డాపురుషుఁడే యదృశ్యుఁడైనందున వారి కాయాశలుండుటకు వీలు లేకపోయెను. ఇఁక బాలిక రానట్లే తమప్రాణములును బోవునట్లు వారు నిశ్చయించుకొనిరి. వారివిచారమునకు హద్దు లేకుండెను. తనయుని కొఱ కేడ్చుతండ్రికంటె వా రాబాలికకొఱకు దుఃఖింపవలసినవారైరి. వా రెందులకు విచారింపరు? తండ్రి తనబిడ్డ చనిపోయినప్పు డాతనిపైఁ గలప్రేముడివలన దుఃఖించును. వీరిలో తమప్రాణములమీఁదికే వచ్చినయీకష్టమున కెట్లు దుఃఖింపకుండఁ గలరు? తండ్రి కేమి? బిడ్డకొఱకు మరణింపనక్కఱ లేదుకదా! వారు తమప్రభువుక్రోధానలమున కెఱయగుదురు. వారు స్తంభము లెక్కవలసినదే యని వా రెఱుఁగుదురు. తా మెట్లీగండము గడిచి బయటఁబడుదు మని యేవారు యోచించుచుకొనుచుండిరి. వారో యాపన్నివారణోపాయమును వెదకుచుండిరి.

వారిలో నొకఁడు, కొంచెముశాంతభావమునవలంబించి "సోదరులారా! ఏల యేడ్చెదరు? మనప్రాణములు మనచాలుకచివర నున్నవని నమ్ముఁడు. ప్రాణములకంటె దీపియుఁ బ్రియము నగుపదార్థ మెొండుకలదా? మనపలుకులవలన మన ప్రాణముల రక్షించుకొననగును. అది యెట్లని మనము యోచించుకొనవలసియున్నది."

“ సోదరా ! నీవు చెప్పినదినిజము. మన మెంతదీనముగ బ్రతిమాలినను, ఖండితముగ దోషులముకామని వాదించినను, మనప్రభువు చెవియొగ్గువాఁడు కాఁడు ! ఈ విచారకరమగు వార్త వినుట తడవుగ నాతఁడు మనలఁ జంపుట కాజ్ఞాపించి తీరును ” అని యొకసిపాయీ ప్రత్యుత్తర మొసఁగెను.

“ మీ రూరక యీసిద్ధాంతములఁ జేయుచుఁ గూరుచుండ నేల? మీయూహ మనమీసారి బ్రతుకఁ గలమనియే! అదిగో! వినుఁడు! సింహములు, పులులు నెట్లు గుహలు ప్రతిధ్వనింప గర్జించుచుఁ జేరువను విహరించుచున్నవో ! ముందు వాని కెర కాకుండఁ గాపాడుకొనుఁడు ! పిమ్మటఁ జూతము ప్రభునియాజ్ఞ ! నాకింకొక సందేహముకూడఁ గలదు. బందిపోటుదొంగల లక్షణములు మీ రెఱుఁగరు. వారు తీసికొని పోయినపల్లకి సురక్షితముగ దాఁచి వచ్చి మరల మనల నందఱ నఱుకవచ్చును. కావున భద్రముగ నుండుస్థలమునకుఁ బోవుదము రండు! బ్రతికియుండిన బలుసాకేరుకొని తినవచ్చును. ” అని మూఁడవవాఁడు హెచ్చరించెను.

“సోదరులారా! నేను దొంగలకుఁ గాని వన్యమృగములకుఁ గాని భయముఁ జెందుచుంటి ననుకొనుచున్నారా? లేదులేదు! నిశ్చయముగ మనమది కోరుకొనఁ దగినదే! మన మీఘోరనిశాసమయమున నట్టిక్రూరజంతువుల కాహారమగుటయే మంచిది. మన కప్రతిష్ఠాకరమగు నిందల నొంది హేయముగ జీవించి యుండుటకంటెఁ జచ్చుటయే మేలు.

మనప్రభువున కీవార్త తెలిసినచో నాతఁ డూరకుండునా? మరణముకంటెఁ గష్టతరమగుసిలుగుల కాతఁడు మనల గుఱిఁ జేయఁడా! ఆతనియాగ్రహమహాగ్నికి మనమింధనములఁ గావలసినదే! అగౌరవజీవితము గడుపుటకంటె దొంగలవలనఁ గాని పవిత్రమరణము నొంది యీయరణ్యమధ్యమున నొరులెఱుఁగకుండఁ బరలోకమునకుఁ బోవుటయే సహస్రవిధముల మనము కోరఁదగినది." అని మొదటియాతఁ డనెను.

ఆతనిమాట లందఱు శ్రద్ధతో వినుచుండిరి. అందులో నొకఁడు "మఱేమి చేయుమందువు?" అనియడిగెను. "ఎట్లయిన మన మీరాత్రి గడపి జీవించియుండినచో తెలువాత లేచి రాజబాలిక కనఁబడుట కేమయిన నాధారములున్నచోఁ బ్రయత్నింతము. ఇచ్చటికి దొంగలనివాసము దూరమై యుండఁగూడదు. నమ్ముఁడు! పట్టపగలు న్యాయయుద్ధమున వారు మన కుద్దికాఁజాలరు. వారిరహస్యప్రదేశముల నుదయమున మనము కనుంగొనఁగలిగినచో మన మీదుష్టులఁ బరిమార్చి రాజబాలికను దీసికొని పోవుదము." అని మొదటియాతఁ డనెను. "నేనీ నిష్ప్రయోజనవాదము నంగీకరింపఁ జాలను. దొంగలు వారి నివాసమునకుఁ జేరువ నెన్నఁడును బాలికను గొనిపోవుటకుఁ బ్రయత్నింపరు. కావున మనప్రయత్నములు నిష్ఫలములగుటయే కాక కాలహరణమునకుఁ గారణములు. మనప్రభువును జేరి దైవముఖమునఁ జెప్పినటుల సత్యమును జెప్పివేయుదము. పిమ్మట నాతనియిష్టము. మనము న్యాయముగనే ప్రవర్తించుటకు నిశ్చ

యించుకొందము." అని సిపాయీలనాయకుఁడు పలికెను. దానికెవ్వరు నెదురాడలేదు. అందఱు నూరకుండిరి.

కొంతసేపు నిశ్శబ్దముగ నుండినపిమ్మట "మన మీకష్టములలోఁ బడవలసినది కాదు. ఈహిందువులగు బోయీలమూలమున మనకీకష్టజాల మొదవినది" అని నాయకుఁ డనెను.

"ప్రభూత్తమా! ఏలినవారి పాదసేవకులము. ఇందు మానేర మేమున్నది?" అని హిందువులగు బోయీ లేడ్చుచు నడిగిరి.

"ఛీ! గాడిదలారా! దొంగముండకొడుకులు! ఈకష్టమున కంతకు మీరు కారకులు కారేమి?" అని నాయకుఁడు గర్జించుచు "మా కీకొండదార్లు - బాటలు - తెలియు నను కొంటిరా? మీరే యీదారుల నెల్లప్పుడు ప్రయాణము లొనరించువారు కదా! మీరీదొంగలతోఁ గలసి యీకుట్ర పన్నినారు. మీరే దొంగలకు గురువులు." అని నాయకుఁడు పండ్లుపటపట కొఱికెను

బోయీలభయమునకు మేర లేకుండెను. స్వార్థమునకై యట్లు బొంకుచుండిన వీరరూపధారులగు సిపాయీల ప్రవర్తనమునకు వారాశ్చర్యపడి వణఁకుచుండిరి. "మంచిది! అయ్యలారా! మాకు శక్తియుండినచో మానిర్దోషత ప్రభువులకడఁ జెప్పికొనక పోము లెండు!" అనికొన్ని నిమిషముల కాబోయీలు మండిపడుచుఁ బలికిరి. అప్పుడు నాయకుఁడు "మీరేమి చెప్పుదురు ప్రభువుగారితో?" నని యడిగెను.

"మే మెఱిఁగిన దెద్ధియో మేము చెప్పెదము" అని బోయీలనిరి.

ఈ ప్రత్యుత్తరము నాయకునిహృదయము" నొకయలుగువలె నాటి యాతనియొడలు జల్లుమనెను. అతఁ డావికారము నణఁచుకొని తెల్లవాఁడనపిమ్మట నాబోయీల కరదండాలు వేయించి పహరాలో నుంపనానతిచ్చెను. సిపాయీలాబోయీల నట్లు శృంఖలాబద్ధులఁ జేసిరి. పిమ్మట వారందఱు గలసి వెడలిపోయిరి. వారిమార్గము దక్షిణాపథమునకే సాగి యుండెను.

---

## మూఁడవ ప్రకరణము.

### శిబిరప్రాంతము.

సిపాయీలు తీసికొనిపోవుచున్న పల్లకియం దున్నవా రెవ్వరని మాపాఠకులు తెలిసికొనఁ గుతూహల పడుచుండి వచ్చును. ఈకథ జరుగుకాలమునాఁటి కాఁడువాండ్రు జనానా విడచిపోవు నాచారము సంపూర్ణముగ నశించినది. దానికేమి? ఈబాలికను బట్టుకొనిన వీరుఁ డెవ్వఁడు? ఇఁక మీఁద నాతని చారిత్రముతోఁ బాఠకులు కృతపరిచయు లగుదురు. ఆబాలిక షాజహానుచక్రవర్తి మనుమరాలును, ఔరంగజీబు కూఁతురునని యిప్పుడు చెప్పినఁ జాలును. తాతగారగు షాజహానుచక్రవర్తి జన్మదినోత్సవముల కామె హస్తినాపురము(Delhi)నకుఁ బోయి యుండెను. ఇప్పు డామె ఢిల్లీనగరమునుండి, మథురలోనున్న

తండ్రికడకుఁ బోవుచుండెను. దక్షిణదిగ్విజయ యాత్రయందు తాను సేనాధిపతి యైనకాలమునం దౌరంగజీబు తనకుటుంబ మును మథురలో నుంచెను. ఔరంగజీబు తనసైన్యమంతయుఁ గూడ నుంచుకొని యక్కడ నెందులకుండెనో పాఠకులందఱు నెఱిఁగిన విషయమే! కావున నాచరిత్రమంతయు నిచ్చటఁ వ్రాయఁ దలంచియుండలేదు.

తనతనూజాత వచ్చుటయం దగుచున్న యాలస్యమున కౌరంగజీ బమితముగ మనఃక్లేశము నొందుచుండెను. ఆమె డిల్లీ నగరమునుండి బయలుదేఱిన ట్లాతఁ డీవఱకే వినియుండెను. ఆమె డిల్లీ నగరమునుండి బయలుదేరి చిరకాలమైనది. ఆమె రావలసినకాలము మించిపోయినది. ఆమె వార్త లేమియుఁ దెలియుటలేదు. ఏమియుఁ దోఁపక యాతఁ డొకచారునిఁ బంపి బిడ్డ యేమైనదియో తెలిసికొని రమ్మని చెప్పి పుచ్చెను. ఈలోపున నాతఁడు మనశ్శాంతిలేక బిడ్డకై కుములుచుండెను. రాజకార్యములు వేఁటలు వినోదములునన్నియు నాఁగిపోయి నవి. ప్రేమమునం దంతశక్తియు నాకర్షణమునున్నవి. జననీజన కులు బిడ్డలకై దిగులుఁజెందుటయం దాశ్చర్య మేమియున్నది?

బాలికను వీరుఁడు తీసుకొనిపోయినపిమ్మట నొకనెలదిన ములు గడచిపోయెను ఒకనాఁ డౌరంగజీబు దర్బారులోఁగూరు చుండి యుండెను. ఆతని సింహాసనముపై పట్టువసనము జాలరు లతో నాచ్ఛాదింపఁబడి యుండెను. సభలోఁ దమకష్టముల విన్నవించుకొనుటకు గుమికూడి వచ్చుచుండినప్రజలును, రాజకీ

యోద్యోగులును, భటులును యథాస్థానముల నిలువఁబడి యుండిరి. ఇంతలో నొకసిపాయీ ప్రభువుముంగలకు వచ్చి వంగి సలామొనరించి, "డిల్లీ సుల్తానున కభ్యుదయ మగుఁగాక" యని హెచ్చరించెను ఔరంగజీబు సిపాయీవంకఁ జూచెను "ప్రభువర్యా! రాజకొమరితను దెచ్చుటకుఁ బోయినభటులు వచ్చినారు. పాలకి లేదు." అని చెప్పెను ఆమాటల కాశ్చర్యము నొంది "ఏమి ? వారివెంటఁ బాలకిలేదా? వారల నిటు రమ్మని చెప్పుము. " అని యౌరంగజీ బాతురతతో ననెను.

సిపాయీ మరల వంగి సలామొనరించి వెనుకకుఁ దిరుగకుండ నడుగులవైచి పరిక్రమించెను "ఔరంగజీబు సింహాసనము చేతిపై నున్నపట్టుదిండుపైఁ జేయినూనుకొని హస్తపద్మమున శిరమును గీలించి "సిపాయీలు వచ్చినారు. రోషినారా యేది? వార లామెను డిల్లీనగరమున విడిచి వచ్చిరా ? ఆమె వచ్చుట నుండవలదని యాజ్ఞాపించితినే ! ఆమె బయలుదేఱినట్లు నాకు వార్త వచ్చియున్నదే ! ఆమెకు మార్గమధ్యమున జబ్బుచేసి— మరణింపలేదుకద! మరణమా ! " అని యాతఁడాత్మనూహించు కొనుచుండెను. "మరణము ! " ఈమాట యాతని హృదయ నాడీసమీకరణమును గదల్చివైచెను. ప్రపంచమంతయు శూన్యముగ నాతనికిఁ దోఁచెను ఆతనినేత్రములనుండి యశ్రుబిందువులు గురిసెను. తమబిడ్డలయందుఁ దలిదండ్రుల కెంత మోహముండును ! సర్వదా బిడ్డలరూపములు వారిహృదయఫలకములపై నెంతస్పష్టముగ లిఖయింపఁబడియుండును ! పలువిధముల

నాతనియాలోచనలు పరువెత్తి యాతనిహృదయమును గలఁచి వైచెను. ఇదివఱకెన్నఁడు నెఱుఁగని యశాంతికరములగు నాలోచన లాతని బుద్ధిపథమున సంచరించు చుండెను.

తనబిడ్డ మరణించినదని నిశ్చయించుకొని యౌరంగజేబు వెల్లఁగ నేడ్చుచు నశ్రుజలముల రాల్చుచుండెను ఆతనికన్నీరు ప్రా నాతని మొఖమల్ దుస్తులు నిండి చెమికీపనిచేసినపూలనడుమ వెఱయుచుండెను, కొంతవడి కాతనిదుస్తులన్నియుఁ దడిసి పోయెను. ఆతని మేధ యంతయు వేఁడియెక్కిపోయెను. ఆతని కన్నుల దృష్టి మందగించెను. ఇట్లు దుఃఖావేశమున మైమఱచి సింహాసనముచేతిపై శిలాప్రతిమవలెఁ బడియుండెను కొంతవడి కాతఁడొక్కనిట్టూర్పును విడిచి, కన్నీళ్లఁదుడుచుకొని, మరల నిట్లాలోచించుకొనుచుండెను "ఆమె మరణించియుండదు. ఏమనఁగాః ఆమెకు మార్గమధ్యమున జబ్బుచేసియుండినయెడల, సిపాయీలు నాకాసంగతి తెలియఁబఱచియుందురు. ఆమె మరణించినయెడల—పాలకిమాట యేమైనట్లు? లేదు! ఆమె మరణించియుండదు! ఏమి ? నాశత్రు వెవ్వఁడైన నామెను బట్టియుండునా? నాకు—హిందూస్థానమున శత్రువా ? అంతవాఁ డెవ్వఁడయ్యా ! ఏమి ? ఏబందిపోటుదొంగలనాయకుఁడో—" ఈకడపటి మాటలనుకొనుసరి కాతనికండ్లు రక్తార్ద్రము లయ్యెను. భ్రూయుగ్మము ముడిపడెను. ఆతని యోష్ఠము లదరుచుండెను. ఆతనికాగ్రహము ప్రకోపించి విచారమును దగ్గించెను. ఆతఁడు శాంతము నొంది సిపాయీలరాక కెదురు చూచు చుండెను

కొంతవడికి రాజసన్నిధాన వర్తియగు మొదటిసిపాయీ ప్రవేశించి వంగి "భటులు వచ్చి తమయాజ్ఞకై వేచి యున్నారు" అని చెప్పుచుండ "తత్క్షణము తీసికొని రమ్ము!" అని ఔరంగజీబనెను.

సిపాయీ పరిక్రమించి వెంటనే భటులతోఁ బ్రవేశించెను "రోషినారా నెక్కడవిడిచి వచ్చినారు?" అని ప్రభుఁడు ప్రశ్నించెను. భటులు తలలువంచుకొని నిరుత్తరులైయుండిరి. బోయీలపై నేరము మోపిననాయకుఁడు ధైర్యము వహించి "ప్రభూత్తమా! మీకు—చెప్పుటకు—కాని—నోరాడకున్న—అయ్యో!—" అని గొణఁగఁజొచ్చెను. వారిప్రవర్తనములఁ జూచి భయముచెంది "మూర్ఖుఁడా! అది యేమియో త్వరగఁ జెప్పుము. రోషినారా! ఏది?" అని ఔరంగజీబుతొందరపెట్టెను.

"రాజబాలికతో నొకనెలదినముల క్రిందట సహ్యాపర్వత పంక్తికడనుండివచ్చుచుంటిమి. అయ్యో!—తుచ్ఛులగు సీహిందూబోయీలొకబందిపోటుదొంగతోఁ గలిసి కుట్రచేసి మమ్ము దారితప్పించిరి. మొదలే చీఁకటి! రాత్రి! పైఁగ వృక్షములుజీమూతములవలెఁ బెరిగి యుండుటచేఁ జీఁకటులు తరుచ్ఛాయలసాంద్రమైయుండెను. అప్పుడు బందిపోటుదొంగ లడ్డగించిరి. పిమ్మట నేమిజరిగినదో యేలినవారికడ నేమిమనవిచేయుదు!" అని సిపాయీలనాయకుఁడు చెప్పి బాలునివలె నేడువఁదొడఁగెను. కన్నీరు దుడుచుకొని "బోయీలభుజములనుండి పల్లకిలాగుకొని దొంగలువెడలిపోయిరి. మేమువారల వెంబడించితిమి కాని కాళ్ళరా

త్రియందు వారిని గనుఁగొనుట దుర్ఘటమయ్యెను. వారు పాఱి పోవుచు నందులోనొకఁడు "ఓసిపాయీలు! మీ ప్రభు వెల్లప్పుడు గజదొంగ, బందిపోటుదొంగ ! యని నిందించువానిచేత నాతని తనూజాత చిక్కినదని చెప్పుఁడు ! అనెను." అని చెప్పుచు మరల నాయకుఁడు కనుల నీరు పెట్టుకొనెను.

ఔరంగజీబు కడపట తలంచినదే నిజమయ్యెను. ఔరంగజీబీకడపటివాక్యముల కుగ్రుఁడయ్యెను. ఆతనిఫాలతలము కందగడ్డవలె నెఱ్ఱపడెను. ఆతనికన్నులనుండి యగ్నికణములు రాలుచుండెను. మీసములు గడ్డము నదురుచుండెను. ఆతని ముకుపుటము లదరిపడుచుండెను. ఆతఁడు మీఁదిపంట నధరోష్ఠముఁ గఱచుకొనుచు హస్తమ్మని యూపిరిఁ బుచ్చి సిపాయీలవైపునకుఁ జూచెను. నాలుకలవెలువఱచు దావాగ్నియో, ప్రచండభానుకిరణములో ప్రతిఫలించునప్పు డుండుసముద్రజలములవలె నాతనిచూపులు తీక్ష్ణములై వెఱపుఁ గొలుపుచుండెను. పిడుగువంటిభయంకరాకారముఁ దాల్చినప్రభుని జూచి సిపాయీలును, రాజసన్నిధానవర్తులును రావియాకులవలె గడగడ లాడుచుండిరి. బోయీలు సంకెలలతో నున్నచేతుల నెత్తి శిరములఁ జేర్చి కన్నీటితో "ప్రభువర్యా! మే మిందెంతమాత్రము దోషులము కాము! మాపై నేరము త్రోసి తమప్రాణముల రక్షించుకొనుటకు—హిందువులమని మమ్మీసిపాయీలు బంధించినారు. మే మేలినవారి చాకిరివాండ్రము. మేము నిర్దోషులము. ప్రభువువారు నిర్దోషులరక్తపాతమునకు సమ్మతింపకుందురుగాక!" అని ప్రార్థించిరి.

"నేనింక నేమియు వినను." అని యౌరంగజేబు మండి పడెను. "తలారివాఁడేఁడీ ? పిలువుఁడు! ఈబోయీాల నీసిపా యీాల నందఱ తలల నఱికించి రండు!" అని యౌరంగజేబుఱి మెను. కొందఱుభటులు సిపాయీాల నందఱ నిగళబద్ధుల నొన రించి, యదివఱకే బంధింపఁబడియున్న బోయీావాండ్రతోఁ గలిపి తీసికొనిపోయిరి. ఈవార్త యౌరంగజేబుభార్యకుఁ దెలిసి నది. ఆమె పరిచారికలు — రోషినారాదాసీలు — అందఱు జనానాగుడారములనుండి యొక్కసారి హృదయకఠోరములగు నేడ్పులఁ బ్రారంభించిరి. రోషినారా కొఱ కేడ్వక యెట్లుండఁ గలరు?

---

## నాల్గవ ప్రకరణము.

### దుఃఖభారమగుహృదయము.

పల్యంకికను దీసికొనిపోయినమనుజు లెన్నియోమార్గముల నడవులఁ గడచి తుద కొకపర్వతదుర్గమును సమీాపించిరి ఆదు ర్గము పర్వతశిఖరమున నుండెను. దాని కొకరహస్యద్వార ము న్నది అది విశ్వాసపాత్రులగు కొందఱు సిపాయీాలకు మాత్రమే తెలియును. వీరామార్గములోఁ జేరుటతోడనే వారు దుర్గము లోపలనున్న వారికి మాత్రమే తెలియున ట్లొక సంకేతము నొనర్చిరి. అప్పుడు దుర్గముబురుజులనుండి బలమైనత్రాళ్లు కట్టిన యుయ్యేలలు కొన్ని క్రిందికి దిగినవి. వారిలో నొకఁడు పాలకి తలుపు తెఱచి వినయపూర్వకముగ నందున్నయామెను "దిగి

యొకయుయ్యెలలోఁగూరుచుండు" మనికోరెను. ఏమిచేయుట కును దోఁపక రోషినారా యొకయుయ్యెలలోఁ గూరుచుండెను. చిటికెలోనాయుయ్యెలవాయుపథమున కెగసిపోయెను. తుదకది దుర్గముగోడలపైకిఁ జేరెను ఈయుపాయముచే నందఱుదుర్గము లోనికిఁ బ్రవేశించినపిమ్మట నారహస్యద్వారము మూయఁ బడెను.

రోషినారా కోటలోనికి వచ్చుటకుఁ బూర్వమామె కొక గది నియమించి యుంచిరి. ఆమె నాదరించి సేవచేయుట కచ్చట కొందఱు నేర్పరులగు పరిచారికల నియమించియుంచిరి. ఆమె నాగదిలోనికిఁ దెచ్చుటతోడనే యొకపరిచారిక కృతాంజలియై "*అమ్మా! మీరిక్కడ సుఖముగ నుండవచ్చును. మీకు వలసిన దెద్దియైన నాజ్ఞాపింపుఁడు. మీపరిచారికలము సిద్ధముగ నున్నాము." అని పలికెను. 'అమ్మా!' అనుమాట రోషినారా కాగ్రహ మొదవించెను తన్ను పట్టుకొని తీసికొనిపోవుటవలనఁ గలిగినదానికిఁ దోడు దాసి తన్ను "ఒకనిభార్య"ను బిలిచినట్లు పలుకరించినందులకు మండిపడెను. రోషినారా ప్రక్కనున్న యొక యాసనముపైఁ గూరుచుండఁ బోయెను అప్పుడు దాసి మరల నమ్మాయని పలుకరించెను ఆమె యుద్దేశము మార్చుకొని.యా సనముపైఁ గూరుచుండలేదు ఆమె కోమలనాసానాళములుమిలమిల లాడుచుండెను ఆమె తోఁకద్రొక్కినత్రాచువలె బుసకొట్టు

* ఇచ్చట నమ్మా యని పిలుచుటవలన రోషినారా తన్నాదాసి యా యింటివానిభార్యను బిలిచినట్లు పిలిచినదని కోపము నొందెను.

చు నిట్టూర్పులఁ బుచ్చుచుండెను. ఆమె పద్మసదృశకోమలవద
నము రక్తిమాతిశయమునొందెను. విశాలనేత్రము లతిచంచల
ములై యామెముఖము నేర్పఱచినట్లు నరములు పొంగి కనఁ
బడునట్లొనరించుచుండెను. ధనురాకారమున నున్న బొమలు
కొంచెము కదలెను. ఆమె గ్రీవము కొంచెము కుంచితమై
యుండెను రోషినారా కోపపరవశయై పరిచారికలతో నేమియు
మాటలాడలేదు. ఆమెకురుల నలంకరించి యున్న పుష్పములఁ
దీసి క్రిందికిఁ బాఱవైచుచుఁ బండ్లతో నధరోష్ఠమును బిగించి
యుండెను.

ఆగ్రహమూర్తియగు నామెను జూడఁజాలక పరిచారిక
లావలకుఁ బోయిరి. ఒక్కతెమాత్ర మక్కడ నిలువఁబడి యుం
డెను. ఆమెరోషినారాను తెప్పవేయక చూచు చుండెను. రో
షినారా కొంచె మాగ్రహముతగ్గి యుండినయెడల నాపరిచారిక
తెలివితేటల గ్రహింపఁగలిగి యుండెడిది. ఆమె పెదవులు నేత్ర
ములు నామెబుద్ధివికాసమును వెలువరించు చుండెను. చమత్కా
రభాషిణియగు నాపరిచారిక విలాసముగ రోషినారా నీ క్రింది
విధముగ పెదవులనించుక తెఱచి కోమలస్వరమున ననెను. "రాజ
బాలికా! ఇతరుల నేరమునకు మమ్ము నిందించెద వేల? మంచిది!
మేమట్లయిన నీసుధలఁ జిలుకుమధురాధరబింబమును పట్టుకు
చ్చులవంటి నీకోమలకేశపాశమును నిందింపవలసి యుందుము
కాఁబోలు! యౌవనమున వరములఁగోరఁదగిన యవి యేమి నేర
మొనరించినవి?"

రోషినారా బదులుపలుకలేదు. ఆమెపక్షమున నీగ్రంథకర్త ప్రత్యుత్తరమిచ్చుచున్నాఁడు. "ఈపనులు కోపమునకుఁ బ్రతిఫలితములు." కోపవికారములు చిరకాలముమాత్రముండవది యొకటి నయము. రోషినారా కోపము క్రమముగాఁ బల్లమునకు దిగుచుండెను. పరిచారికపరిహాసపూర్వకసంభాషణము రోషినారానీక్రిందిప్రశ్ననడుగునటులొనరించెను. "నీపేరేమి?" అని రోషినారా దాసి నడిగెను. ఇప్పుడు రోషినారాకు తనప్రభుని యానతి ననుసరించి మరలించుట సులభ మని యామె గ్రహించెను ఆమె యెక్కడలేనిసంతోషమును దెచ్చిపెట్టుకొని నవ్వుచు "ఏలినవారిపాదసేవకురాలిని, గులాబీ యని పిలుతురు." అనెను. రోషినారాయామెనొకటిరెండునిమిషములు చూచుచు నిలువఁబడి తుదకు "గులాబీ! నీదేకులము?" అని యడిగెను.

గులా.—ఈదురదృష్టవంతురాలి తలిదండ్రులు హిందువులే!

రోషి.—నీవింకను హైందవి వేనా?

గులా.—అవును

రోషి.—అట్లయినచో మహమ్మదీయాచారము ననుసరించి వస్త్రమును ధరించియున్నావేమి?

గులా—నాప్రభునియాజ్ఞల ననుసరించి.

రోషి—ఎందులకు ?

గులా.—మీరు మహమ్మదీయులు. ఏమో! మీకితరకులము వారిని జూచిన నసహ్యముండునేమో! మీరట్టివారిచేఁ బనులఁ గొనకపోవచ్చును. అందువలన మీకుఁ గష్టముగ నుండ కుండవలయు నని యీవేషము వేసినాను.

రోషి.—అట్లయిన నారహస్యమును నాకేల బయలుపఱిచి నావు?

గులా—నాయిష్టము ననుసరించి కాదు. (గులాబీకి నవ్వు వచ్చెను.) మీాసమ్మోహనాస్త్రసదృశకటాక్షమాలికావశనై రహస్యభంగము కావించితిని.

ఈమాటలవలన రోషినారాకు నవ్వు వచ్చెను ఆమె తలవంచుకొని యొకయాసనముపైఁ జదికిలఁబడి యీావిధముగ నాలోచింపసాగెను. "ఏమి ? ఈమె నాకుఁ గొన్నిసంగతులఁ జెప్పఁజాలదా ? ఈమె సామాన్యపుబానిసకత్తె కాదు ఏమో! నే నామె నడుగుప్రశ్నలకుఁ బ్రత్యుత్తర మీాయఁగూడదా! అయినను జూచెదను." అని నిశ్చయించుకొని రోషినారా తనకుఁ గొన్నిప్రశ్నలకుఁ బ్రత్యుత్తరమిమ్మని కోరెను.

"మీా కేమి తెలియవలెను?" అని యాశ్చర్యముతో గులాబీ యడిగెను.

రోషి.— మొట్టమొదట — నీవు సత్యమునే చెప్పుదునని వాగ్దానమొనరింపుము.

గులా.—దీనికొఱ కింతవిశ్వప్రయత్నమేల ? నాయాత్మలాభమునకు భంగకరముకాని విషయ మెద్దియైన విన్నవించెదను?

రోషి.—నీయాత్మలాభ మేమియుఁ జెడిపోనేరదు. మంచిది ! నన్నిచ్చటకుఁ దీసికొనివచ్చినవా రెవరు? ఎందులకుఁ దెచ్చిరి?

గులాబీ.—అమ్మా ! క్షమియింపుఁడు! నేను మీాకీవఱకే బానిస నని చెప్పియున్నాను. అందు నేనాత్మలాభమునకుఁ జేరిన

దానను. మీాయీా ప్రశ్నమునకుఁ బ్రత్యుత్తరము చెప్ప వీలు లేదమ్మా మఱి.

"అట్లయిన నాకిందులకుఁ బ్రత్యుత్తరము మఱియెవ్వ రిత్తురు?" అని బానిసకత్తె బదులుమాటల కలిగి రోషినారా మరలఁ బ్రశ్నించెను.

"మా ప్రభువుగారు మీామాటలకుఁ బ్రత్యుత్తర మీా యఁగలరు." అని పరిచారిక పలికెను.

రోషినారా ముఖ మెఱ్ఱఁబాఱెను. ఆమె యాకారమున దుఃఖము నశాంతియుఁ బ్రతిద్యోతితమగుచుండెను. ఆమెకన్నుల నుండి యశ్రుజలములు ధారవాఱెను. ఆమె తనభవిష్యద్భా గధేయమునుగుఱించి యీావిధముగ నాలోచింపఁదొడఁగెను. "నా వెంటవచ్చినరక్షకభటు లేమిచేయుచున్నారు ? నన్ను విడి పించుటకుఁ దగినప్రయత్నములు చేయుచుండిరో! లేదో ! మాతండ్రికడకు వా రెట్లుపోఁగలరు. వారు నిశ్చయముగ మరణదండన మనుభవింతురు. ఔరంగజీ బెప్పుడు నాసిలుగులఁ బోనడచును?" ఆమె జన్మభూమి సౌందర్యమును, తలిదండ్రుల ప్రేమరసపూరితమూర్తిద్వయమును, తనతాతగారికిఁ దనయెడఁ గల యనురాగ విశేషమును, రోషినారాకు జ్ఞప్తికి వచ్చెను. ఆమె సోదరుల యానందమూర్తులు రోషినారాహృదయదర్పణ మునఁ బ్రతిబింబించియుండెను. ఆమెనేస్తకాండ్రందఱు జ్ఞప్తికి వచ్చుచుండిరి. ఆమె యవనతకటాక్షములు జలపూరితములై యుండెను.

వేఁటకాండ్రు వనములకుఁ బోయి పట్టితెచ్చిన చిలుకల గోరువంకల వినోదముకొఱకుఁ బంజరముల నుంచి కొందఱు పెంచుదురు. బంగారపుఁబంజరమున బంధింపఁబడినట్లు పక్షినై తినే యని రోషినారా తలపోయుచుండెను. పంజరము కమ్ములు తగులునట్లు టపటపమను ఱెక్కలచప్పుడుతోఁ గూసి యలసి పడియుండు పక్షివలె నామె విశ్రాంతి లేక యుండెను. ఆమె కొంతవడి కిట్లు యోచించుకొనుచు—పాపము. తనగుడారమున నున్నట్లామె భ్రమఁజెందెను.

జనకుఁడు "సుఖముగఁ బ్రయాణము సాగినదా?" అని తన్నడుగుచున్నట్లామె తలఁచెను తనతల్లి పంపిన పరిచారికతోఁ దల్లిదేరాకడకుఁ బోయి యామెతోఁ దనప్రయాణవిశేషములు వర్ణించి చెప్పుచుండినట్లామె యెంచెను. ఆమె మిత్రులతోఁ గలసి తనపటకుటీరమునకుఁ బోవుచుండెను. ఇట్టితలఁపోఁతలఁబడి భ్రమఁజెంది యామె యాసనమునుండి లేచెను. ఆమె యెచ్చటికిఁబోవుటకో లేచినదని గ్రహించి గులాబీ "ఏమమ్మా?" అని పలుకరించెను. "ఎచ్చటికిఁ బోవుదురు?" అని యడిగెను.

రోషినారా యివియేమియు నాకర్ణింపలేదు. గుమ్మముకడకుఁ బోయెను. అప్పుడు గులాబీ యామెవస్త్రమునుబట్టి వెనుకకు లాగెను. ఆఁగి రోషినారా గులాబీవైపునకు వెఱ్ఱిచూపులంపెను. "ఏమమ్మా? అట్లు భయముఁ జెందినట్లున్నారు?" అని చిఱునవ్వుతో గులాబీ ప్రశ్నించెను. "ఇక్కడ నన్నాపవలదు. నేను నాగుడారమునకుఁ బోవలయును." అని రోషినారాకోప

ముతో ననెను. "అమ్మా! తొందరపడకుఁడు. కొన్ని నిమిషము లాఁగుఁడు. మీ దేరాకు నేనే తీసికొని పోయెదను కాదా!" అని గులాబీ రోషినారా మనస్థితిని గుర్తించి పలికెను.

ఈమాటలు పనిచేసినవి. రోషినారా మరలఁ గూరుచుండెను. రోషినారా మాటలాడక కూరుచుండి యుండెను. ఆమెకింక నొడలు తెలియదు. మూఁగవలె నుండెను. మతిచెడిన వారివలె నామె గొణుగుకొనుచుండెను. ఆమెఫాలతలమంతటఁ జెమ్మటలు గ్రమ్మెను. అప్పుడు శీతకాలమైనను, ఆమె పర్వత శిఖరమున నుండినను, ఘర్మబిందువులు ధారలుగట్టుచుండెను. రోషినారా యుక్కచే బాధపడుచుండుటఁ గనిపెట్టి, గులాబీ యామెదుస్తుల విప్పి ప్రక్కనుంచి, చేరుమాలతో నామె చెమ్మటలఁ దుడిచెను. ఈయుపచర్య రోషినారా శరీరదౌర్బల్యము నించుక మాన్పి, యామెమైమఱపు నించుక తగ్గించెను. రోషినారా యొక్క నిట్టూర్పువిడిచి,దుస్తులతోఁ గన్నులమూసికొని కన్నుల నీరు పెట్టుకొనుచుండెను. చాలసేపటివఱకు నెవ్వరును మాటలాడుట లేదు.

"అమ్మగారు రేడ్చుచుండిరేల? ఇక్కడ మీకే బాధయుఁ గల్గునని భయపడవలసినది లేదు. మీకిక్కడ మిక్కిలి సౌఖ్యముగ నుండును." అని గులాబీ కొంతవడి కనెను.

రోషినారా ప్రత్యుత్తర మీయలేదు. "నిష్ఫలముగ మనఃక్లేశముల నొందనేల? శరీరమానసికములగు బాధలకుఁ గుందుట ప్రాజ్ఞులపని కాదు. దురదృష్టమువలనఁగాని, మతే

యితరకారణములవలనఁ గాని క్లేశములొందవినప్పుడు దుఃఖించు వా రజ్ఞులు, విద్యలేనివారు. బుద్ధిమంతు లెప్పుడు నట్టిబాధల సరకుగొనరు. ఇంత బుద్ధిమంతురాండ్రయిన మీరిట్లు దుఃఖాతురులగుట మంచిదికాదు" అని గులాబీ యుపన్యసించుచుండెను.

రోషినారా తలయెత్తి పరిచారికను జూచెను. మేఘాచ్ఛాదితుఁడగు చందురునిబోలె, నాఁచుచేఁ గప్పఁబడినపద్మకుసుమముభంగి రోషినారా కోమలవదనము వసివాడి వత్తయి యుండె నని గ్రహించెను. రోషినారా వదనము పాలిపోయినట్లుండెను. ఆమెకన్నులనుండి యశ్రుజలములు వర్షించుచుండెను.

"గులాబ్! పారతంత్ర్య మెరికి సుఖ మొదవించును? నే నౌరంగజీబు తనూజాతను. నాకీదుఃఖమును బందియు నెట్టు సహ్యములగును?" అని దుఃఖాక్రాంతమైన కోమలస్వరమున రోషినారా బదులు పలికెను.

ఈమాటలు గులాబీ మృదులహృదయమును గరగించెను; కాని యామె రోషినారాపైఁ గలిగినదయవలన నేమి చేయఁగలదు? ఆమె తనప్రభువు కోరికల కంగీకరించి తీరవలయును. గులాబీ తనమనోవికారములను రోషినారా గ్రహింపకుండఁ బ్రవర్తించుచుండెను.

"అమ్మగా రింకొకనిక్రింద బానిసవలె నుండిరనుకొనుచున్నారా?" అని గులాబీ తిరుగ సంభాషణముఁ బ్రారంభించెను.

"అవును! నే నట్లనుకొనకుండు టెట్లు:" అని రోషినారా ప్రత్యుత్తర మొసఁగెను.

"మీరు ఢిల్లీనగరమున నుండినట్టి బానిసఁదనము నిచ్చటఁ బొందరు" అని గులాబీ గర్వోక్తుల నభినయముతోఁ బలికెను.

"ఆపరమరహస్య మెట్లో విప్పిచెప్పుము!" అని రోషినారా యడిగెను.

గులా.—మీరిచ్చటఁ జెఱసాలయం దుండు ఖైదీలవలె జనానాలో నుండనక్కఱ లేదు మీరు ఢిల్లీనగరమునందువలె నెల్లప్పుడు చీఁకటికొట్లలో మెలఁగనక్కఱ లేదు. మీరిచ్చట మీమనసునకింపైనట్లు మెలఁగవచ్చును.

రోషి.—(కోపముతో) నేను పుట్టినప్పటినుండియుఁ జెఱసాలయం దుంటిని. నేను చచ్చువఱకు జనానా తెరలలోపల నే జీవింప నిచ్ఛగింతును. నీవు చెప్పునది సౌఖ్య మనియు స్వాతంత్ర్యమనియు నేఁ దలంపను.

గులా.—మంచిది! మీరు సెలవిచ్చినది సత్యమే! కాని మీరు ఢిల్లీనగరమున కెట్లు పోఁగలరు?

రోషి.—ప్రస్తుత మిచ్చటనుండి తప్పించుకొనుసాధనాంతరములు లేవు

గులా.—అట్లయినచో మీకీయాందోళన మేల?

రోషి.—గులాబీ! జననియు జన్మస్థానమును స్వర్గముకంటె మధురములని మాసంస్కృతోపాధ్యాయుఁడు చెప్పుచుండు వాఁడు!

గులా.—అది స్త్రీజాతికి మాత్రము కాదు.

రోషి.—ఎందులకుఁ గాదు?

గులా.—జన్మస్థానము స్వర్గము పురుషునకు మాత్రమే! ఆఁడు వాండ్రు వివాహమైనపిమ్మట భర్తయింటికిఁ బోయి నివసింపవలసి యుందురు. అమ్మగారి కీసంగతి తెలియకపోదు.

రోషి.—(గర్వముతో) మొగలాయీ రాజబాలిక లట్టిమార్పులకు భయముచెందరు.

గులా.—మీ రీయాచారమును మార్పఁజాలరా? అట్లొనర్చిన నెందఱో మొగలాయీ బాలికలు మిమ్మనుసరింతురు.

ఈమాటలు విని రోషినారా గులాబీపై కొక్కకటాక్షమాలిక నంపెను. ఆమెయట్లే గులాబీని చూచుచుండెను. ఆమె కనుఱెప్పల కనిమిషత్వము కలిగినట్లుండెను. ఆమె నిదురనిట్టూర్పుల విడుచుచుండెను. ఆమె చెక్కు లెఱ్ఱవాఱెను. ఆమెవదనము గంభీరభావమును దాల్చెను. ఆమె పెదవులుకొంచె మెత్తఁబడి కంపించుచుండెను. ఆగ్రహపూరితమగు కన్నీళ్లు కాలువలుగట్టుచుండెను. ఆమెదుస్తులతోఁ గన్నుల మూసికొనియుండెను. మాటలాడుటలేదు. ఆసేవకబాలిక యామె నోదార్పఁ దలంచెను. కాని యామెహృదయ మట్టివానిని నిరాకరించుచుండెను. కొన్నినిమిషములకుఁ బిమ్మట నింకొకపరిచారికవచ్చి వంటరైనదని చెప్పెను. రోషినారా తలయెత్త లేదు. గులాబీ రోషినారాహస్తమును తనచేతఁగీలించి మెల్లఁగ "అమ్మా! మనసౌఖ్యమును హెచ్చించునది మనదురదృష్టమే! కష్టసుఖములు కావడికుండలు! కష్టములవలననే సౌఖ్యములవిలువ తేటపడును. లెండు-

భోజన మొనరింపుఁడు" అని హెచ్చరించెను. రోషినారా బదులు చెప్పలేదు. ఈవిధముగ నామె వితర్కించుకొనెను. "జీవములు పోవుచున్నను వానిని కాపాడవలసినది ధర్మము. అట్టియెడ నే ననవసరకష్టముల కేల పాల్పడవలెను?" అంతట రోషినారా "మంచిది. పోవుదము రమ్ము!" అని లేచెను. గులాబీ దివ్వెను జేతఁబూని దారిచూపెను. రోషినారా గులాబీతో దుర్గమునం దలి మఱియొకగదిలోనికిఁ బోయెను. అచ్చట నెన్నియో మధుర భక్ష్యములు సిద్ధముగ నుండెను. ఆపళ్లెరములపై, భోజనపదార్థ ములపై నొకదీపము రక్తకాంతులఁ బ్రసరింపఁ జేయుచుండెను. ఆమె కూరుచుండుట కొకయాసన ముండెను. మాంసాహార ములు గాక తక్కినమధురాహారములన్నియు నుంట రోషినారా చూచెను. ఆమెపదార్థములన్నియు రుచిచూచెను. భోజనానం తర మామె మొదటవిడిసినగదిలోని కామెను దీసికొనిపోయిరి. అచ్చట నామె యొకసుందరహంసతూలికాతల్పముపై నడుము వాల్చి, సకలకష్టనివారక మగుసుఖనిద్రం జెందెను.

---

## ఐదవప్రకరణము.

## దుర్గదర్శనము.

తెల్లవాఱుచున్నది. అరుణోదయకాంతులు ప్రాగ్దిశాభూ మిని నలంకరించెను. వాయసములు పాటుపడవలసినవారిని లే పుటకా యనునట్లు 'కాకా' యని విసుగులేక కూయుచుండెను.

చిలుకలు, గోరువంకలు మున్నగు శకుంతములు మధురకలకూజితము లొనరించి దైవప్రసాదమగు నమృతమును మానవులకర్ణపుటంబులఁ జిలకరించి యానంద మొదవించుచుండెను. బకశ్రేణులు టపటపమని రెక్కలు విదర్చి మత్స్యభోజనలాలసమానసంబుల సరోవరంబులఁ జేరుచుండెను. రాత్రినుండియుఁ దమ రాక కెదురుచూచుచున్న విరహిణులగు ప్రియులను చక్రవాకములు తెల్లవాఱవచ్చినదని గ్రహించి చేరుచుండెను. దిఙ్మండలమును, పర్వతశిఖరావళియుఁ బొగమంచు తెరలావరించియుండెను. తరుశాఖలును బుష్పలతలును మంచుబిందువుల వర్షమును రాల్చుచుండెను. భానుఁడు ప్రాచ్యదిఙ్మండలమునుండి తొంగిచూచుచుండెను. క్రమముగా నెమలిపింఛమువలె నాతని యరుణకిరణజాల మాప్రాంతములనున్న పర్వతప్రదేశముల నాక్రమించుకొని పోవుచుండెను. హిమాద్రిములైన పత్రపుంజములావినిర్మలభారమునఁ గుంచితములై నిఖిలలోకకర్తయగు దేవునికై తపస్సుచేయుచున్నట్లుండెను. ఆపత్రముల నుండి జారుమంచుబిందువులు భక్త్యావేశమునఁ గలిగిన యానందాశ్రుజలములభాతి నొప్పియుండెను. ఎత్తైనమహాపర్వతశిఖరములన్నియుఁ బ్రజ్వలితాగ్ని కాంతులఁ దగుల్కొనినట్లుండెను. దినరాజగుసూర్యుని గులాబీకాంతుల నీనుకిరణజాల మాతడి యాకులపై నన్నియోరంగులఁ బ్రతిఫలింపఁ జేయుచుండెను. సంతోషానందముల యంకతలమునఁగూరుచుండిన భూదేవి పక్షులమధురకూజితములకు మైమఱచి ప్రకృతిసౌందర్యములఁ గ్రమముగా నదేపనిగ వెలిపుచ్చుచుండెను.

రోషినారా శయ్యనుండి లేచి, ప్రార్థనమొనరించుకొని, దుస్తుల ధరించెను. ఆమె యాదుర్గమందలి వివిధభాగములఁ జూచుటకుఁ బరిచారికలతో బయలుదేఱెను. కొండవాంత్రాదుర్గమున నిలువ చేసిన యమూల్య పదార్థములు గలగదు లన్నియుఁ దిరిగి చూచెను. ఆదుర్గ మొకపర్వతశిఖరమునఁ గట్టఁబడిన బలిష్ఠమైన ఱాతిగోడలకోటయని యామె తెలిసికొనెను. ఆదుర్గ కుడ్యములపై స్వర్ణవికారప్రతిమ లెల్లెడల నింపుగనింపి యాకళాప్రాశస్త్యమును వింతగఁ బ్రదృశ్య మగునట్లు చేసియుండిరి. కొన్నిచోట్ల దీర్ఘకరవాలము లొరలలోనుంచి గోడలకు వ్రేలాడఁదీసియుంచిరి. ధగధగ మెఱయు సీశెలు బల్లెములును బ్రోవులుగాఁ బెట్టియుంచిరి. మఱికొన్ని చోటులయందు విండ్లును,నారులును, ఈఁకెలుకట్టిన బాణములును, కంచుకములు,ఱాళ్లు, తుపాకులు, జీనులు, మున్నగుయుద్ధసామగ్రు లపరిమితముగ నిలువ చేసి యుంచిరి. నఖశిరఃపర్యంతము నాయుధధారులైన పలువురు రక్షకభటులు గదులన్నిటికడఁ బహారా త్రాయించుచుండిరి.

రోషినారా దుర్గమును బరీక్షించుచుండఁ నామెకొకచిత్రమైనగది కనఁబడినది. అందు సోఫాలును, పుస్తకభాండాగారము నమర్పఁబడియుండెను. ఆగది మిక్కిలి సుందరముగ నున్నది. పుస్తకముల బీరువాలప్రక్కనే చదువరులకుఁ బ్రక్కనియాసనము లమర్చి యుంచిరి.

పుష్పములు,పుష్పసరములు, పన్నీరులు, మంచిగంధము మున్నగు పరిమళద్రవ్యములు గదియంతటఁ దమపరిమళములు వ్యాపింపఁజేయుచుండెను. ఆగదియందు లోటేమియు లేదు

ఇదియంతయుఁ జూచి రోషినారా యి ట్లనుకొనెను. "ఈదొంగలుకూడ సంఘనియమముల నెఱిఁగి ప్రవర్తించుచున్నారే! సాటిసోదరుల బాధించి ధనము సేకరించు వీరికిఁగూడ నన్నియుఁ దెలియును."

రోషి.—గులాబీ! ఈపుస్తకము లెవరివి?

గులా.—"నాకుఁ దెలియ దమ్మా! ఐనను మానాయకుఁ డీపుస్తకములు మీసంతోషమునకై సేకరించెనని తలంచెదను." అని గులాబీ రోషినారాకు బదులుచెప్పెను.

రోషినారా దీనినిబట్టి యీయుద్గ్రంథము లీదుర్గాధిపతి వేయని తలంచి సంతసపడెను. ఆమె కిప్పుడు సంతోషమునకుఁ గారణ మేమున్నది చెపుమా? అవును. దుర్గాధిపతి విద్యావిహీనుఁడగుపశువు కాఁడనియు, ఇట్టిగ్రంథసముదాయమునందుఁ బ్రీతిగలయాతఁడు దుర్మార్గుఁడు కాఁజాలఁడనియు నామె తలంచియుండును. ఆమె వెంటనే భాండాగారమునుండి 'సాదీ'యను గ్రంథకర్త పారసీకభాషయందు రచియించిన 'గులిస్తాను' అను గ్రంథమును దీసి చదువుకొనసాగెను కొన్ని నీతిగీతములు చదివినపిమ్మట నామె హాఫీజు, ఫిర్దుసి మున్నగుకవులగ్రంథములుఁ గూడఁదీసి యక్కడక్కడఁ జదివెను. ఆమెకు సంస్కృతమునందును బరిచయము కలదు ఇంతలో నామెకొకగీర్వాణగ్రంథము కనఁబడినది. అందుండి యామె యీక్రిందిగీతమును జదివెను.

శ్లో. "తారావలీప్రహితకాంతిలసత్కిరీటః
భిన్న స్మహాంధతమసం నిజదీప్తిఖడ్గైః,

చంద్రోఽపి నామ మృగయుర్న కి మేతి ఖేదం
కో వా మహానపి సముజ్ఝతి కర్మసూత్రమ్."

గీ. "తార లంపెడుకిరణముల్ తనకిరీట
మగుచుఁ గ్రాలంగఁ గాంతులయలుగు లంపి
కాఱుచీఁకటు లెల్లెడఁ బాఱిపోవ
వేఁటలాడెడుశశి యైనఁ జేటుపడఁడె?
యెవ్వ రీకర్మసూత్రంబు నెదురఁగలరు? "

ఒక్కనిట్టూర్పును విడిచి రోషినారా పుస్తకమును బ్రక్కనుంచెను. "అవును. దురదృష్టమును మీరఁ గలవారెవ్వరు? ఎందుల కీకష్టము? ఎందుల కీప్రయత్నము?." అని యామె తలంచెను కాని యామెకు ఢిల్లీనగరమందలి యంతఃపురసౌఖ్యములు జ్ఞప్తికి వచ్చెను. కన్నుల నీరుగ్రమ్మెను. ఆమె దుఃఖము నణఁచుకొని లేచి తనగదిలోనికిఁబోయి నిద్రించెను. అప్పుడంతకంటె నామెకు సుఖమెట్లు కలుగును ? నిద్ర సకలకష్టసుఖములను బాఱఁద్రోలి యామెను లాలించెను.

---

## ఆఱవప్రకరణము.

### పర్వతముపై నున్న మందిరము

రోషినారా నిద్రనుండి లేచుసరికి పదిగంటలైనది. ఆమెకన్నులఁ దెఱచుసరి కామెప్రక్క నొకయువకుఁ డుండెను ఆమె యాతనినిళ్చలకటాక్షముఁ జూచెను ఆయువకుని కిరువది యేడేం డ్లుండును. ఆతఁడు చుఱుకైనవాఁడుగను శూరుఁడు

గను కన్పట్టెను. అవయవములు తీర్చిన ట్లుండెను. విశాలమైనవక్షస్థలమున్నతముగనుండెను. ఆతని నెన్నుదురుసౌందర్యశోభితమై విశాలముగ నుండెను. బాహువులు దీర్ఘములై వర్తులములై యుండెను. కంఠము, మెడ, వదనము నుండవలసిన ట్లుండెను. ఆతనినాసిక కొట్టవచ్చిన ట్లుండెను. నేత్రములు చెంగలువలే! భాను కాంతుల నీనువజ్రస్థగిత మగుతురాయిగల శిరోవేష్టనము, ప్రక్క వ్రేలాడుచున్న రత్నములమర్చిన యొరలోనికత్తి, చేత శూలగుత్తియు నాతని యోధవేషమును మనోహరముగఁ జేయుచుండెను. ఆయపరిచితవ్యక్తినిఁ జూచి రోషినారా భయమంది వణఁకెను. యువకుని ప్రథమసందర్శనమునకే యువతీమణి భయమందలేదు!

యువకుఁడు తలవంచుకొని కూరుచుండి యున్న వాఁడు రోషినారాను కన్నులెత్తి చూచెను. ఆమె నిరుపమానసౌందర్యము నాశ్చర్యముతోఁ జూచుచు "నే నిదివఱకిట్టియసమానరూపవతినిఁ జూచి యుండలేదు." అని యాతఁడు తలంచి మైమఱచి యుండెను.

ఆయువతీమణికిప్పు డిరువది యేండ్లుండును. యౌవనము పరిపూర్ణస్థితి నొందుచున్నది. ఆమె మనోహరసుందరాంగములపై — కౌమారలక్షణములపై — లజ్జాలతలు ప్రాకుచుండెను. ఆలతలు నిద్రగన్నెరులతీగలవలె ముడ్చిన నిద్రించు వానివలెఁ గన్పట్టుచుండెను. ఆయువతి శరత్కాలమేఘము స్వల్పవాయుసంచలనమునకే కదలిపోవునట్లుయువతి నిశ్వాసమాత్రమునకే చలించిపోవుచుండెను. ఆయువతీమణి రామణీయకమునకుయువకుఁడు పర

మానందభరితుఁడై పోవుచుండెను. చక్రవర్తి తనూజాతయగు రోషినారామనోహరాంగకములు యువకునిమతిమాలినవానిగ నొనరించుటలో నాశ్చర్యము లేదు. ఉంగరములగు నెరినీలంపుఁ గురులు, ముద్దులుమూటగట్టు వదనము, విండ్లవంటికనులు, ఇవి యన్నియు మనోహరములే! అందు రోషినారావంటి యువతీమణి సౌందర్యసౌభాగ్యము నతఁడుచూచియు నేమగును?ఆమె వక్షస్థ్సలమున నాభరణభూషితమైన సుందరవస్త్రము మహమ్మదీయసంప్రదాయానుసారముగ నాచ్ఛాదింపఁబడి కాంతులఁ గ్రమ్ముచుండెను. రంగురంగుల పట్టు వస్త్రముల నడుమ ప్రకాశించుచున్న యామెవదనపద్మమును, కన్నులును, హస్తరాజీవములును,కొలనులో నీలంపునీరంబులనడుమ పత్రశైవాలముల చాటున సగముసగముగఁ గన్పట్టుచుఁ బ్రకాశించు తామర పూలను, కలువలను దలపించుచుండెను.

కొంతవఱకీయపూర్వసౌందర్యసందర్శనమున గన్నులు తనివితీర యువకుఁడు నిట్టూర్పువిడిచి "సుందరీమణీ! నీ విట్లేల కూరుచుంటివి?" అని రోషినారా నడిగెను.

రోషినారా బదులు పలుకలేదు తనసుందరాంగుళులతోఁ దనదుస్తులచివరనున్న పోగుల నూడఁదీయుచుండెను

"ఆఁడువాండ్రు లజ్జాపుంజములని మీరెఱుఁగరా. మహాప్రభూ!" అని గులాబీ యాకస్మికముగ ననెను.

"ఒక లజ్జయే కాదు. మఱికొన్ని కూడఁ గలవు" అని కూరుఁడు నుడివెను.

"ఆమఱికొన్ని యెవ్వరో ప్రభువులు తెలియఁజేయుదురా?" అని గులాబీ యడిగెను.

"సర్పముకోరలయందుండువిషముకంటె భిన్నముకానివిషము వనితలవాలుచూడ్కులలో దైవము దాఁచియున్నాఁడు" అని శూరుఁడు నవ్వుచు పలికెను.

"అనఁగా?" నని గులాబీ ప్రశ్నించెను

"ఇప్పు డీమెచూడ్కులు నాహృదయమును దహించుచున్నవి. నీకుఁదెలియుట లేదా?" అని యువకుఁడు నవ్వుచుఁ బలికి రోషినారా వైపునకుఁ దిరిగి "నీవేఁడిచూడ్కుల నన్నేల బాధించెదవు? నిన్నావరించిన లజ్జాయవనికం దొలఁగించి నాతో దయతో మాటలాడఁజాలవా?" అనెను.

యువకుని మాటలవలనఁ బ్రయోజనము లేకపోయెను. విజితుండై యువకుఁడు కూడఁ దలవంచుకొనెను.

చాలసేపటికి యువతీమణి పెదవులు మెదపినది ఆమె యెద్దియో గొణుగుకొని యీవిధముగఁ బ్రశ్నించెను. ఆసుస్వరమునందలి మాధుర్యమునకు యువకుఁడు సంతోషసముద్రమున మునిఁగిపోయెను.

"ఈదుర్గస్వామి యెవరు?" అని రోషినారా యడిగెను.

"నేనే" యని యువకుఁ డనెను.

"మీ పేరేమి?"

"శివాజీ"

"నాతండ్రి శివాజీని గుఱించి ప్రసంగించువాఁడు. శివాజీ బందిపోటుదొంగ యని యాతఁడు పలుమారుపలికెను. నీవేనా ?"

"అవును ! ఆదొంగను నేనే."

"నీవు మతిమాలినవాఁడవని తలంచితిని. వెఱ్ఱివాండ్రె నను వారు తమకేనష్టముకలుగుపను లొనరింపరు. నీవు వెఱ్ఱి వాఁడవును కావు—"

"నన్నేల వెఱ్ఱివాఁడ వనెదవు?"

"నీ వాత్మహాతకుఁడవని యిప్పటికి నెఱుఁగకుంటివా ?"

"నాకేమో తెలియ లేదు."

"మూర్ఖుఁడా ! నీవు నన్నపహరించితివి. దీనికిఁదగిన ప్రాయశ్చిత్తము నీకు జరిగితీరునని నమ్ముము."

"నన్నట్లు ధ్వంసముచేయ సాహసింపఁగల బలవంతుఁ డెవ్వఁడో విన వేడుకపడుచున్నాను."అని శివాజీ గర్వముతోఁ బలికెను.

"మొగలాయిచక్రవర్తి!" అని రోషినారా బదులు చెప్పెను.

"మొగలాయిచక్రవర్తియా" అని శివాజీ నవ్వుచు "నాకాతఁడు భయమునొంది నిద్రాహారపానీయములకు దూర మయ్యెనది నీవెఱుఁగవు కాఁబోలు" నని పలికెను.

"దానికేమి ? నీవు నన్నిక్కడ కేల తెచ్చితివి ?

"నాకుఁ గలయొకకోరికను దీర్చుకొనుటకు."

"అవి యెద్దియో?"

"నాకుఁ జక్రవర్తితో సంబంధము చేసికొనవలయునని కోరిక కలదు." అని శివాజీ నవ్వెను.

రోషినారాకన్నులయందాగ్రహచిహ్నములు ప్రకాశించెను. ఆమె శివాజీని దూషింపనెంచినట్లామె పెదవులు కదలికనొందెను. ఆమె నాసానాళములు విస్ఫారితములై కొట్టుకొనుచుండెను. చల్లనిగాలికిఁ గదలునీటికలువవలె నామెవక్షస్థలమదరెను తెల్లనియామెవదనము కందగడ్డవలె నెఱ్ఱంబడెను. "నేను! తామెర్లను రాజవంశమునందు జన్మించిన నేను బందిపోటుదొంగ కర్థాంగినగుటయా?" అని రోషినారా యసహ్యకోపము ముప్పిరిగొనఁ బలికెను.

"నష్టమేమి?" అని శివాజీ గర్వముతో నని "తామెర్లను మొదలగు మీపూర్వులుకూడఁ బరాక్రమప్రదర్శనముననే పేరుప్రతిష్ఠలు గణించిరి. వారికంటె ననేకవేలరెట్లుపరాక్రమవంతుండనగు నాతో సంబంధమునకు నీవంతగా నేహ్యపడెద వేల?"

రోషినారా మాటలాడలేదు.

"సుందరీమణీ! నే నెన్నడును బందిపోటుల నొనరించియుండలేదు. నేను మహారాష్ట్రమునకు స్వతంత్రప్రభుండను. నీకిక్కడ సంపూర్ణస్వేచ్ఛావిహారముండును. కానినీవీదుర్గమును మాత్రము విడువఁజాలవు. నేను నిన్నప్పుడప్పుడు దర్శించి నా నయనములఁ బవిత్రమొనరించుకొని తృప్తినొందుచుందును. నాకిప్పుడు సెలవా?" అని శివాజీ నవ్వుచు వెడలిపోయెను.

"రోషినారా యెప్పటివలెఁ బ్రార్థనాదికముల చేసికొని మఱియొకగదిలోనికి విశ్రాంతికై వెడలిపోయెను.

---

## ఏడవ ప్రకరణము.

ఔరంగజీబు రోషినారాఖానుని కెంత ప్రయత్నించినను, దురదృష్టమువలన నాతని కేమియుఁ దెలియలేదు. పెద్దసైన్యమును దీసికొని మహారాష్ట్రమునందలి దుర్గములన్నియు నాశనము చేయుట కాతఁడు తలంచెను. ఆప్రయత్నము లొనరించుచుండ నాతఁ డాకస్మికముగ ఢిల్లీనగరమునకుఁ బోవలసివచ్చెను. తనసేనానాయకులలో నొకఁడగు సైస్తఖానుఁడను నాతనిఁబిలిచి "నీవు సైన్యములతోఁ బోయిరోషినారానుదీసికొనివచ్చుటకుఁ బ్రయత్నించుచుండుము. నీసహాయమునకు దల్వారుఖానుని, రాజా జయసింగును గొప్పసైన్యములిచ్చి పంపుదును. నీవాదుండగుఁ డగుశివాజీని బట్టి రోషినారాను మరలఁదీసికొని రాఁగలిగితివా నీకు గొప్పబహుమానము లిత్తును" అని యెన్నియోవిధములఁ జెప్పి యౌరంగజీబు ఢిల్లీనగరమునకు వెడలిపోయెను. శివాజీని జయింప సైస్తఖానుఁడు పూనాపట్టణపరిసరముల సైన్యములతో నుండెను.

ఇప్పుడు పాఠకుల కించుక శివాజీజీవితచరిత్రమునువిన్న వింపఁదలంచితిమి. రత్నఖనియగు భారతజననిని జయింప మొగలాయీలు పరమోత్సాహముతో హిమవత్పర్వతమును దాఁటి వచ్చి ఢిల్లీనగరము నాక్రమించుకొనినప్పుడు యిబ్రహీంలోడీ యను ఢిల్లీచక్రవర్తి వారి నెదిరించెను. కాని రాజనీతిజ్ఞుఁడు కాని లోడీ యదృష్టమింకొకవిధముగ నుండెను. అదియేమి పాపమో!

భరతఖండ మెప్పుడు నొకేజాతిపాలనమునందుఁ జిర కాలముండ లేదు దౌలతుఖానుఁ డను పంజాబీ సేనానాయకుఁడు కూడ శత్రువులగు మొగలాయిలకు సాయపడెను. ఎట్లయిన నేమి? మొగలాయీలు పఠానులఁ దఱిమి వేసిరి. కాని దక్షిణహిందూ స్థానమున పఠానులీకథజరుగు కాలమునాఁటి కింకను ప్రభువులై యుండిరి.

విజయపురము (BiJapore) నందుఁ బఠాను రాజ్య మిం కను మొగలుల స్వాధీనము కాలేదు. ఇబ్రహీంఆదిల్ షాపరిపా లనమునందు శహాజీయను మహారాష్ట్ర యోధుఁ డొకఁడు సేనా నాయకుఁడుగ నుండెను. ఆతఁడు మిక్కిలి గొప్పఁ వాఁడని ప్రసిద్ధి నొందెను. ఉచితకాలమున శహాజీ తనదేశమునకుఁ బ్రభు వయ్యెను. అతఁడిరువురుభార్యలఁ బెండ్లియాడెను. అందు జిజీ బాయి కిరువురుపుత్రులు గలిగిరి. పెద్దవానికి సంభాజీయనియు, రెండవవానికి శివాజీయనియు నామకరణ మొనరించిరి

శివాజీకిఁ బదియేండ్లువచ్చుసరికి శహాజీ విజయపురము నకుఁ బోయియుండెను. సవతులకయ్యములు, కుటుంబకలహ ములు, మూలమున జిజీబాయి తనరెండవపుత్రుఁడగు శివాజీని తీసికొని తన తండ్రి యింటికిఁ బోయెను. నిమ్బాల్కరను మంచి గృహస్థుని తనూజాత నచ్చటనే మఱికొంతకాలమునకు శివాజీ పెండ్లియాడెను. పిమ్మట జిజీబాయి పూనాపట్టణమునకు నూతన దంపతులఁ దీసికొని పోయి యచ్చటనే వసియించుచుండెను.

శహాజీ జిజీబాయిని మఱచిపోలేదు. శివాజీనిమాత్రము మఱచిపోఁగలఁడా? తమతో సుఖముగఁ గాఁపురము చేయుట

కష్టపడని జిజీబాయిపై నాగ్రహమొకప్పుడు కలిగినను జిజీబాయి పూనాలోనున్నట్లు విని శహజీ, వెంటనే దాదాజీ కోనదేవుడను బ్రాహ్మణున కధికారమిచ్చి తనకుఁ బునహాపట్టణమునందున్న జమీందారీ నంతయు జాగరూకతతోఁ జూచుచుఁ దనభార్యను పుత్రిని కాపాడవలయునని నియమించెను కొలఁది దినముల లోనే దాదాజీప్రజ్ఞవలన పునహాపట్టణమంతయు శివాజీకి భృత్యులై పోయిరి. వారందఱు శివాజీకిఁ బరమమిత్రులైరి

సహ్యాపర్వతపంక్తిపై మిత్రులతో శివాజీ వేఁటకుఁబోయి బలవంతులగునాయోధుల సాహసమున నెంతయు నభివృద్ధి నొందుచుండెను. తండ్రి యాశ్వికదళమంతయు శివాజీచెప్పు చేఁతలలో నుండి యాతనికాప్రాంతముల పర్వతారణ్యదుర్గమ ప్రదేశముల వలనఁ బ్రవర్తింప సాయముగు చుండెను. శివాజీ కప్పటికిఁ బదునాఱేండ్లు! శివాజీ యప్పుడొకసారి కొంకణదేశ మంతయు దోఁచుకొనినట్లు చెప్పుదురు. ఆతఁ డాయుధసాహాయ్యమున మొదట ధనార్జన మొనరించి క్రమముగ మాతృదేశమును పారతంత్ర్యమునుండి కాపాడఁ బ్రయత్నించుచుఁ గ్రమముగ సఫలమనోరథుఁడగుచుండెను.

దక్షిణహిందూస్థానమునందు పఠానులకును మొగలాయీలకును బోరు జరుగునప్పుడు శివాజీ మంచిసమయముని గ్రహించి, తనసైన్యముతోఁ దనకులాభము కలుగుపక్షమునఁ జేరి క్రమముగ మహారాష్ట్రమునందలి దుర్గములన్నియుఁ గైవసము చేసికొనెను. ఉత్తరకొంకణమును సంపూర్ణముగ శివాజీ యీసమయమునందే సంపాదించెను.

విజయపురపు నవాబు శివాజీ నెన్నివిధములఁ బ్రయత్నించి నను సాధించుట దుర్ఘటమని తలంచి, యాతనితండ్రియుఁ దన సేనాధిపతియు నగు శహాజీని బందిఖానాలో వైచెను. అందు వలనఁ బుత్రుఁడు లొంగునని నవాబు తలంచెను. ఈ వార్తవిని విషాదపడి శివాజీ షాజహానుసాయమువలనఁ దండ్రిని విడిపించుటయే కాక పూనాపట్టణప్రాంతదేశమును దుర్గములను గూడ సంపాదించెను. ఎన్నియోవిధముల విజయపురపు నవాబు శివాజీని బంధింపఁదలంచి, యట్లుచేయలేక విసిగి, తనసేనాధిపతియగు అఫ్జుల్ ఖాను శివాజీనిఁ బట్టుకొనుటకు బదు లాతఁడే దుర్మరణమునొంది సైనికులదారుణమరణమును జూడవలసినవాఁ డయ్యెనని చరిత్రపాఠకు లెఱుఁగనిదికాదు ఇదిపనికాదని విజయ పురపునవాబు శివాజీతో సంధిచేసికొనవలసినవాఁ డయ్యెను. అందు శివాజీ యిష్టమునననుసరించి సంధి జరిగినది. ఈ సంధి వలన పునహాప్రాంతములకు శివాజీప్రభుత్వము స్థిరమైనది.

మహారాష్ట్రదేశమునందలి కొండలలో వసియించు భిల్లులు, మావలీలు, బడిగీలు మొదలగు కోయజాతులు శివాజీకి సైనికులు. వారుకృతునియలనుట మహమ్మదీయసైనికులుమాత్రమే యెఱిఁగినవిషయముకదా! వీరిసాహాయ్యముననే శివాజీ యనేకాద్భుతకార్యము లొనరించె ననుట యతిశయోక్తి కాదు. మేఁకలు సరీసృపములు కూడ నెక్కఁజాలని కొండశిఖరముల కెగఁబ్రాకియు, చీమలు దూరలేని దుర్గమప్రదేశముల కవలీలగ నేతెంచియు స్వామికార్యపరాయణులగు కొండజాతులు శివాజీరాజ్యనిర్మాణకర్తలైనట్లు తెలియుచున్నది. వీరి మొగ

లాయీాసైన్యముల గమనమును గనిపట్టుటకు శివాజీ నియమించి యుండెను.

రోషినారా ఢిల్లీనుండి మధురాపట్టణమునందున్న తండ్రినిఁ గలిసికొనఁబోవుచుండగాఁ గనిపట్టి యీాచారులు చెప్పఁగావిని యామెను బట్టినచో నౌరంగజీబుతో సులభముగ సంధి కుదురునని తలంచి శివాజీ యామెను బట్టుకొనెను. తమయిష్టమగునిబంధనల కామొగలాయీా లంగీకరింతురనియే రోషినారాను బంధించుటయందు శివాజీకి మొదటనున్న యూహ! ఇది యిప్పుడు లేదు రోషినారా సౌందర్యమును జూచుచు నామెకటాక్షవీక్షణముల మెలఁగవలెనని శివాజీ యభిలషించెను. ఢిల్లీనగరమునందు రాజకుటుంబమున కలహములు, యుద్ధములు సాగినవి ఈసమయమున దేశమును, రోషినారా హృదయమును శివాజీ క్రమక్రమముగా సాధింపఁ దలంచుచుండెను. అం దెంతవఱ కాతఁడు విజయమునొందినదియు నీపిమ్మటఁ బాఠకు లెఱుఁగఁగలరు.



## ఎనిమిదవప్రకరణము.

## దుస్స్వప్నములు.

శివాజీ రోషినారాను రాయగడదుర్గమునం దుంచెను. అది శత్రువులు స్వప్నమునందైన ముట్టడించి జయింపలేరని శివాజీకిఁ దెలియును. శివాజీ స్వాధీనమునందున్న పెక్కుపర్వతదుర్గ

ములకంటె నిది దుర్భేద్యమైనది ఆతని యితరదుర్గములతో మనకిప్పుడు ప్రసక్తిలేదు. దుర్గమునందుఁ బూలతోఁటలు, విహారారామములు, గదులు, మందిరములు, సోఫాలు, చల్లగాలి వీచునదుపాయములు, మొదలగునవన్నియుఁ గలవు. రోషినారాను బ్రతిదినము శివాజీ చూచుచుండెను. క్రమముగా నామె కాతనియందుఁ గలవిరోధభావమంతయుఁ బోయినది. అంతేకాదు. ఆమె కాతనిపై స్నేహభావముకూడ నంకురించినది. కాని యామె యాభావముల నాతనికిఁ దెలియనిచ్చుటలేదు.

ఒకదినమున రోషినారా పుస్తకశాలయందుఁ గూరుచుండి యొకపుస్తకమునందలి పద్యములఁ జదువుచుండెను. గులాబీ వినుచుండెను. చల్లగాలి పరిమళముల గదియంతట వ్యాపింపఁ జేయుచుండెను. కొంతవడికి రోషినారా "గులాబీ! నాకు సుఖమెంతమాత్రము లేకున్న దేమి?" అని యడిగెను.

"అదియంతయు నీమనస్సుపై నాధారపడియున్నది." అని గులాబీ నవ్వుచుఁ బలికెను.

"అవును. అక్కడమాత్రము సౌఖ్య మేమున్నది?" అని రోషినారా నవ్వుచుఁ బలికి తెల్లఁబోయెను.

"అమ్మా ! మీకసౌఖ్యకారణము లెవ్వి?"

"లేదు. నాకు దుఃఖము లేదు. కాలమునకుఁ బ్రతిజీవుఁడును లొంగియుండవలెను. అదియే నా కసౌఖ్యకారణము."

"నాకుఁ దెలియ లేదు."

"నేను సుఖజీవనమునకుఁ బుట్టియుండలేదు" అని రోషినారా నిట్టూర్పువిడిచెను.

"నీకు సుఖమే లేదా ? సుఖముకొఱకు జన్మింప లేదా?"

కన్నీళ్లతో రోషినారా యిట్లు పలికెను. "కడచినరాత్రి నిద్రించుచుండఁగా నాకొకస్వప్నము వచ్చినది. అది విచిత్రమైనది. మాతాతయగు షాజహానునకు చాలజబ్బు చేసినదఁట. ఆతఁడు మరణించునని రాజ్యముకొఱకు నాతండ్రి తనసోదరులతోఁ గలహించెనఁట తుదకు నాతండ్రి సింహాసనస్థుఁ డయ్యెనఁట నాతండ్రి తనసోదరులను వారికుటుంబములను నాశనమొనరించెనఁట; నాతాత చావలేదఁట. ఐనను నాతండ్రియే పరిపాలించుచుండెనఁట! ఈవిధమగుస్వప్నమునంతయు విమర్శించుకొనుచునే నాకస్మికముగ నొకదివ్యపురుషునిఁ జూచితినఁట! ఆతఁడు సూర్యునివలెఁ బ్రకాశించుచుండెనఁట. ఆతఁడు నాశయ్యప్రక్కనిలువఁబడి "దురదృష్టవంతురాలా! నీకు షాజహానువలెనే కష్టములొదవును" అనెనఁట. అంతట భయముతో నేను నిద్రనుండి లేచితిని." ఇట్లు చెప్పి రోషినారా దుఃఖింపసాగెను.

"ఎందుల కేడ్చెదరమ్మా?" అని గులాబీ యోదార్చెను. "స్వప్నములెన్నఁడును సత్యములు కాఁజాలవు. దానికొఱ కింత దుఃఖింపనేల ?"

"అవును. స్వప్నములు సత్యములు కానేరవు కాని దుస్స్వప్నములు సత్యములు కాఁజాలవని చెప్పఁగలవా రెవ్వరు?"

"మంచి దిదియంతయు జరుగుననుకొమ్ము. అంతమాత్రమునకు నీవు దుఃఖింపవలసిన దేమున్నది?"

"ఏమంటివి? గాయములుతగిలినవారికేఁగాని వానిబాధ తెలియనేరదు."

"అంతగాయ మెవరికిఁ దగిలినది?"

"దురదృష్టవంతురాలనగు నాకే" అని రోషినారా నిట్టూర్పును విడిచెను.

"వైద్యునిఁ దీసికొని వచ్చెదనా?" అని గులాబీ హాస్యమాడెను.

"నీవైద్యుఁ డీగాయమును మాన్పఁజాలఁడు."

"మావైద్యునిశక్తి నీవెఱుఁగనిది కాదు. చాల ప్రజ్ఞావంతుఁడు."

"క్రొత్తవైద్యునిచే నాకు వైద్యముచేయించుకొన నిష్టము లేదు. అదిగాక నాకిది సౌఖ్యసాధమునకే తీసికొనిపోవునేమో? నేనడ్డపడనేల?"

"మీ కేది సౌఖ్యముగ నుండునో సెలవిచ్చెదరా?"

"నేను మరణించినచో నాకుఁ బరమసౌఖ్యముగ నుండును."

ఈ ప్రత్యుత్తరముతో గులాబీహతాశురాలై పోయెను. రోషినారా యీవిధముగఁ జెప్పుట కామెకు బలవత్తరమగు కారణము లుండకపోవు. ఐన నారహస్యముల నామె గులాబీ వంటి బానిసకుఁ దెలియఁబఱుపఁ దలంపలేదు.

---

## తొమ్మిదవ ప్రకరణము.

రోషినారా శివాజీకి సూర్యకాంతివలెఁ గన్పించినది. ఇఁక నాతఁ డా ప్రకాశమానమగు యువతీమణిని విడువలేక

పోయెను. ఆమెను జూచి ప్రేమించినప్పుడు శివాజీ తనకామెయే దుఃఖకారణ మగునని తలంపలేదు. ఈప్రతిమ నారాధించుట వలనఁ గలుగులాభ నష్టముల నాతఁడెన్నఁడును యోచించుకొని యుండఁడు. తనభావిజీవితమునం దీప్రకాశ మెంతచీఁకటి నొదవించునో యెఱిఁగియుండనిశివాజీ యామెప్రకాశమున కాస నొందియుండఁడు ఇప్పు డాతని కామెపైఁ గలప్రేముడి సులభముగాఁ బోవునదియా?

ఒకనాఁడు శివాజీవచ్చి రోషినారా ప్రక్కనుగూరుచుండియుండెను. గదియంతటనిశ్శబ్దముగనుండెను. కొంతవడికి శివాజీ యొక్కనిట్టూర్పును బుచ్చెను. ప్రేమపూరితమగు వాక్యముల నాతఁడు రోషినారాతో "నీముఖరాజీవ మెప్పుడువికసించును?" అనిప్రశ్నించెను "సూర్యకాంతి లేనిది రాజీవ మెట్లువికసించును?" అని రోషినారా యనెను.

"ఆసూర్యుఁ డెన్నఁటికి వచ్చును?"

"ఆసూర్యుఁ డెప్పుడు వచ్చునో మొదలే రాఁడో నాకుఁ దెలియదు." అని రోషినారా తలవంచెను.

"నాకోర్కు లాకాశహర్మ్యములని నేనెఱుఁగుదును. కాని నేనాకోరికను విడువఁజాలకపోవుటయే నాకు సంతాపమొదవించుచున్నది."

"మనము కోరఁగనే కోర్కులు సఫలించిన మనకు దుఃఖమెట్టిదో తెలియనే తెలియదు."

రోషినారా కన్నులవెంబడి నీరు వెడలుచుండెను.

శివాజీ దగ్గరిలి "రోషినారా! దుఃఖపడుచుంటివేల?" అని యడిగెను.

"ఇంక నేను దుఃఖించుట నీవుచూడవు" అని రోషినారా కన్నులం దుడుచుకొనెను.

తనకుం బ్రత్యుత్తరము రాలేదని శివాజీ తలవంచుకొనెను రోషినారా దుఃఖముచే నిశ్చేష్టితయై యుండెను.

కొంతవడికి "నేను నిన్ను పూజించుటకుంగూడ నర్హుండంగాను" అని శివాజీ పలికెను.

ఇంక రోషినారా తనప్రేమప్రవాహము నాటంకపఱిచి యూరకుండంజాలకపోయెను. ఆమె వెంటనే శివాజీచేతినిం బట్టుకొని తనమృదులాంగళీయములం బెనవేసి, యాతనిదృష్టులు తనచూడ్కులం గలియుట తడవుగ "ప్రభువర్యా! నీకీర్తికాంతులచే నీదేశమును బ్రకాశమంతమగునట్లొనరించుచుంటివి. ఐనను నేను నాయాత్మబంధువులయిష్టము లేనిది నిన్ను—జాలను—" అనెను.

ఈ మాటలు పలుకునప్పటికి రోషినారాకండ్లు జలపూరితములై పోయెను. కంఠస్వరము రుద్ధమైపోయెను. ఈమాటలనినరోషినారా హృదయగహ్వరమునందలి యోచనలం బరిశీలించు శివాజీశరీరము సంతోషముచే నుబ్బొంగి పోయెను. వారిహృదయము లేకమై యుంట మందిరద్వారముకడ నేమి జరుగుచున్నదియు వారెఱుంగం జాలకపోయిరి.

అచ్చట నొకఫకీరు లాంతరు చేతం బట్టుకొని నిలువంబడి యుండెను. శివాజీ యాతనిం జూచెను. శివాజీయెప్పుడుచూ

చునా యని కను పెట్టికొనియున్న ఫకీరు "మహారాజునకు మేలగు గాక!" యనెను. శివాజీ యానవాలుపట్టి "రమ్ము! కూరుచుండుము. అంతయు సరిగ నున్నదా?" అని యడిగెను. దేవర పరిపాలనమున లోటులుండునా? భవాని కృపావీక్షణముల నన్నియు సరిగనున్నవి"

శివా:—నీ విప్పుడెచ్చట నుండిరాక?

ఫకీ:—దేవరయానతిచొప్పున మారు వేషములఁ దాల్చి ఢిల్లీ నగరమునకుఁ బోయి మొగలాయీసైన్యముల గమనమును బరిశీలించి వచ్చితిని. విశేషములేవైనఁ గలవా?

రోషినారా ఢిల్లీవర్తమానముల విననచ్చునని విస్ఫారిత నేత్రములఁ జూచుచుండెను.

ఫకీ:—అక్కడ విశేషములు దేవర వినలేదా?

శివా:—అవును! ఢిల్లి సింహాసనమునకు షాజహానుపుత్త్రులు పోట్లాడుచుండిరని వింటిని.

ఫకీ—చిత్తము. అది యిప్పుడు ముగిసినది. సోదరులను బిల్లల నందఱఁ జంపి, తండ్రినిఁ జెఱనిడి, యలంగీరు బిరుదుతో నాతఁడు సింహాసనము నెక్కెను

ఈవార్తవిని ప్రచండవాయుప్రసరణమునఁ గూలునట్టి యనఁటివోలె రోషినారా మూర్ఛిల్లెను. శివాజీ తత్క్షణమే యామెను బట్టుకొనెను గులాబీనిఁ బిలిచి శివాజీ యామెను శైత్యోపచారము లొనరింపుమనుచు ఫకీరునకప్పటికిసెలవొసంగెను వార్తాహరుఁ డిదిచూచి విస్మయమొంది వెడలిపోయెను.



# పదియవ ప్రకరణము.



ఫకీరు వార్తలు చెప్పిపోయిన రెండుదినములకుఁ బిమ్మట నొకనాఁడు శివాజీ తనమందిరమునం దొంటరిగాఁ గూరుచుండెను. రోషినారాను బట్టితెచ్చినది మొదలు నేఁటివఱకు జరిగిన సంగతులన్నియు విమర్శించుకొనెను. రోషినారా తన్నిష్ట దమితముగఁ బ్రేమించుచున్నదని గ్రహించెను. ఆ మెసిగ్గుపడుచున్నది కాని లేనియెడలఁ దనప్రేమను వెల్లడించియుండునని తలంచెను. కొంతవడి కాతనికి రోషినారాతో సంబంధము తనప్రజల కేహ్యము కలిగించునా యని తటపటాయించెను. భగవంతుని దృష్టిలో నీకార్యము దోషము కాదనుకొనెను అందఱు దేవుని బిడ్డలే యనితలంచెను. రాజపుత్రులు మహమ్మదీయులతో వియ్యమంద లేదా ? యని సమాధాన పెట్టుకొనెను. ఔరంగజీబుతో మైత్రి కిది సాయపడుననుకొనెను. తండ్రిని జెఱకంపినవాఁడు బిడ్డ భర్త నాదరించునా యని సందియమొందెను ఆతనియాగ్రహాను గ్రహములతో నా కేమిపని? యని తలఁచెను. జాతిమత రాజ్యములు పోయిననేమి? ప్రాణములైన లెక్కచేయక రోషినారాను బెండ్లియాడుటకుఁ దీర్మానించుకొనెను."

ఇంతలో సంతరాత్మ "శివాజీ శాంతమ్ భూషణమ్" అని ప్రబోధించినట్లు తలంచి యోచించుచుండెను.

కొంతవడి కొకభృత్యుఁడు వచ్చి యాతనికొకచీటి నిచ్చెను. శివాజీ గురువగు రామదాసస్వామి శివాజీని భవానీ దేవి యాలయమునకు వచ్చి తన్నుగలసికొనుమని యుండెను.

శ్మశానవాటికలచే భయంకరమై భీమానదీపరిసరంబుల నున్నభవానియాలయమునకు రాత్రి రెండుజాములకు బయలు దేఱిఖడ్గమాత్రసహాయుఁడై శివాజీగురువునుగలిసికొనెను అతని తో నప్పటి రాజ్యపరిస్థితుల నన్నిటిని ముచ్చటించెను. సైస్త ఖానునిఁ జంపుటకుశపథము చేసి వెడలిపోవసిద్ధముగానుండఁగా రామదాసుస్వామి శివాజీ నౌరంగజీబుతో సంధి చేసికొనుమని చెప్పెను ప్రాణమున్నంతవఱకు మహారాష్ట్రుఁడు మొగలాయీ లకు భృత్యుఁడుకాఁజాలఁడు మీరిట్లాజ్ఞాపించుట న్యాయము కాదని శివాజీ బదులు చెప్పెను. గురువు సెలవిచ్చి శివాజీ నాశీర్వదించి పంపెను

మఱి రెండుదినములలో శివాజీ రాత్రి రెండుజాములకు సైస్తఖానుని శిబిరమును ముట్టడించి యాతనిఁ దఱిమి లక్షల కొలఁది ధనకనకవస్తువాహనంబుల సంపాదించినట్లు రామదాసు స్వామి వినియుండకపోలేదు.

శివాజీ రాయగడదుర్గమునుండి బయటికిఁ బోయినప్పు డొకనాఁడు మంకాజీయను శివాజీ సిలిదారు సైన్యమున కధ్యక్షుండొకఁడు విహరించుచున్న రోషినారాను జూచుట తటస్థిం చెను. మంకాజీ యామెకడకుఁ బోయి, తన్ను బెండ్లియాడు మని బలవంతము చేసెను. రోషినారా యాతనిమోసగించి మఱు

నాఁడే వచ్చి కలిసికొని పాఱిపోవుదమని చెప్పి చల్లఁగా దుర్గములోనికిఁ దప్పించుకొనిపోయెను. మంకాజీ స్వామిద్రోహము నంతయు శివాజీకి రోషినారా చెప్పివేసెను.

శివాజీ యాగ్రహపరవశుఁడై యాతనిఁ జంపుటకునిశ్చయించుకొనెను. నేరమును విచారింపకుండఁజంపినచోఁ దనసైన్యమునం దతృప్తి కలుగునని యెంచి శివాజీ యాతనితో ద్వంద్వయుద్ధ మొనరింపఁ దీర్మానించుకొనెను.

రోషినారా తనకు వాగ్దానమొనరించిన ప్రకారము తనతోఁబాఱిపోవుటకు వచ్చునని కనుపెట్టుకొని మంకాజీప్రయాణసన్నద్ధుఁడై యుండెను.

శివాజీ ప్రభాతమున లేచి రోషినారా పరుండియున్న మందిరద్వారముకడకు వచ్చెను. ఆమె లేచి యదివఱకే దైవప్రార్థన మొనరించుకొనుచుండెను. రోషినారా! దైవము నుద్దేశించి, "దేవాదిదేవా! నా ప్రాణప్రియుఁడగు శివాజీతోనన్నుఁ జేర్చి మాదోషముల క్షమియించి సుఖజీవన మిమ్ము. మాతండ్రి పాపహృదయమునుండి మాలిన్యమును దొలఁగింపుము శివాజీ యెడఁ దప్ప నాకన్యులయెడఁ బ్రేమ మొదవకుండ రక్షింపుము. నాయీజీవితమున కాతనినే నాథునిఁ జేసి పాలింపుము" అని రోషినారా పలికినపలుకులు శివాజీ చెవులార విని ధన్యుఁడనైతినని తలంచి రోషినారాను సమీపించి యానందము నొందెను. రోషినారా ప్రభాతముననే తనకడకువచ్చి తనప్రార్థనమును వినిన మనోనాయకునిఁ జూచి విస్మితురాలై యాశ్చర్యము నొందెను.

ప్రాణనాయకు నుచితరీతి నాదరించెను. ఆమె కశ్రుజలము లపరిమితములయ్యెను. శివాజీ యాఁడుదానికంటె నధికముగ దుఃఖించెను. ఎందులకో వారే యెఱుఁగరు ఒక రేడ్పుట రెండవ వారికిఁ గష్టముగ నుండెను. ఒండొరులు గన్నుల నీరుగ్రమ్మకుండఁ దుడిచి సమాధానపడిరి. కాని వారిహృదయములయందుఁ జలించుభావము లెవ్వ రెఱుఁగఁగలరు? ప్రణయిను లెఱుఁగఁగలరని మన మూహింపవచ్చును

మంకాజీని జంపుటకు ద్వంద్వయుద్ధమొనరింపఁ బోవఁదలంచి శివాజీ రోషినారా చేతుల నెంతయోకష్టముపై విడిపించుకొని, యాశీర్వదించి యుద్ధమునకు సెలవొసంగిన వీరపత్నియగు రోషినారాను బహూకరించి శివాజీ దుర్గప్రాంగణమునకు వచ్చెను.



## పదునొకండవ ప్రకరణము.

నిర్ణీతకాలమునమంకాజీతో శివాజీయుద్ధ మొనరించియాతనికుడిభుజమునుశివాజీ నఱకివేసెను. మంకాజీయునుమల్లయుద్ధవిశారదుఁడగుట శివాజీకిఁ గూడ మెడపై బలమైనగాయము తగిలినది. అది లెక్కగొనక శివాజీ తనపడకగదిలోనికి రక్తపాత మధికమగుట దుస్తులువిడిచి శివాజీ కండ్లు తిరిగి మంచముపైఁ బడిపోయెను. ఆదెబ్బకు మఱియొకరెవ్వరైన నీసరికే మరణించియుందురు గాయముతగిలిన సంగతిచూచి సేవకులఁ బిలిచి

గులాబీ రోషినారా కడకుఁ బరువెత్తెను. రోషినారా భయమున రెండడుగులలో శివాజీగదిలోనికి భయముతోఁ గన్నీటితోఁ బరుగెత్తుకొనివచ్చెను. అప్పటికిశివాజీ పెదవులు మెదలుచుండెను. హీనస్వరమున "రోషినారా! మనోహారిణీ! మరణము సమీపించినది. నాకొక్కసారి కనఁబడుము." అనుచుండెను. రక్తసముద్రపరివృతుఁడై, మైమఱచి పడియున్న శివాజీనిఁ జూచుసరికి రోషినారా కన్నులనుండి జలములుజలజల రాలిపోవుచుండెను. శివాజీ బాధచే "అమ్మా! బాబు! రోషినారా! శ్రీరామ!" అనుమాటలఁ బలవరించుచుండెను. "అయ్యో! బుద్ధిహీనురాలవగు రోషినారా! నీవెంతమూర్ఖురాలవు. నీశివాజీ యిప్పుడు మరణమునొందినచో నీవేమయ్యెదవు? నిన్నారాధించునీప్రాణవిభునితో నీవలకేచేరక యాలసించి నీవెంతదుఃఖమును గలిగించుకొంటివి? నీవు దురదృష్టవంతురాలవు" అని యెవ్వరో రోషినారా చెవిలో ననినట్లయ్యెను. ఆమె స్థాణువువలె నిలువఁబడిపోయెను.

కొంతవడికి రోషినారాకు స్మృతివచ్చి పరిచారముచేయుచున్న సేవకులను, వైద్యులను, కొంచెము తప్పుకొనుఁడని చెప్పి, తనప్రాణనాయకునిఁ జేరి యాతనితల తనయొడిలో నుంచుకొని కళావిహీనమగుచున్న వదనమును జూచెను. రక్తమెన్ని మందులు రాచిన నాఁగుటలేదు. రోషినారా యశ్రుజలములు మాత్రమాఁగుచున్నవా?

వనితలు రోగుల కుపచారమొనరించుటకుఁ బుట్టిన దేవతలు స్త్రీలు పనికిమాలినవారనినిందించుబుద్ధిమంతు లొక్కసారి.

రోగులై తాము మూర్ఖురాలనుకొను స్త్రీచే నొక్కసారి యుప చారము నొందుదురుగాక! ఎంత తెలివిమాలిన వనితయైన నితరులబాధ చూడఁజాలక చేయుపనులఁ జూచియైన స్త్రీలహృదయమును బురుషు లెఱుఁగుదురుగాక!

వైద్యుఁడు పెదవి విఱచి "ఈరక్తప్రవాహ మాఁగిన చోనేను సులభముగ మహారాజును బ్రతికింపఁగలిగియుందును" అనుకొనెను.

రోషీనారా భయముతో "నదికష్టమా?" అని ప్రశ్నించెను.

వైద్యు:—భయము లేదు. రక్తధారలు తగ్గుచున్నవి. రోషినారా కాశ యుప్పవించి కొంచెము ధైర్యము వహించి కన్నులు తుడుచుకొని గాయమును జూచి, మందు రాయుచుండెను.

రోషి —రక్తస్రావము మానినదా?

వైద్య —జ్వరము తగ్గవలెను. పిమ్మటఁగాని యీతనికి స్మృతి రాదు.

రోషి —జ్వర మెప్పటికిఁ దగ్గవచ్చును?

వైద్య.— తెల్లవాఱుసరికి.

రోషి.— ఈతఁడు పైకిఁ జెందుచున్నయంతబాధ లోపలఁ బొందుటలే దనుకొనియెదను.

వైద్య.—అవు నాతనికి మనస్సు సుఖముగనే యున్నది.

రోషి.—నీవు చెప్పినమాటలవలన నాకు బాగుగ ధైర్యముకలిగినది. చంద్రున కొకనూలుపోగువలె—ఇది నీకష్టములకుఁ దగిన ప్రతిఫలము కాకపోయినను—దీనినిఁబరిగ్రహింపుము.

మహారాజున కించుక నెమ్మది కలిగినతోడనే గొప్పబహుమానము లందఁగలవు." అని రోషినారా తనమెడ యందున్న వజ్రములహారమును దీసి వైద్యునకిచ్చెను.

వైద్య.—(ఆశ్చర్యముతో) "అమ్మా! ఈగొప్పబహుమానము మహారాజున కారోగ్యము కలుగువఱకుఁ దీసికొనుట కిష్ట పడను. మన్నింపుఁడు" ఇట్లనుచు వైద్యుఁడు హారమును దిరిగి యీయఁబోయెను.

రోషి—అయ్యా! నీవట్లనవలదు నీవీబహుమానమును స్వీకరించుట నన్ను గౌరవించుటగా భావించెదను. సందేహింపకుము.

వైద్య—నీకు మంగళమగు గాక! ఈబహుమానమును వందనములతో స్వీకరించితిని.

వైద్యుఁడు నాడి పరీక్షించి తొందర లేదనిచెప్పి కొన్ని మందులిచ్చి నిశ్చితకాలము ననుసరించి మందులు రోగికిచ్చునట్లు రోషినారాతోఁ జెప్పి యేమాత్ర మేమరుపాటుండినను చిక్కులుకలుగునని చెప్పెను. అతఁడు సెలవుతీసికొనుచు రోగికేమియు భయములేదని రోషినారాకు ధైర్యముచెప్పి వెడలిపోవుచుండెను.

"నీవు తిరిగి యెప్పుడు వచ్చెదవు?" అని రోషినారా యడిగెను.

"సాయంకాలము తొమ్మిదిగంటలకు వచ్చెదను" అని వైద్యుఁడనెను.

రాత్రి యగుచున్నది. పరిమళవంతమగు గదియందు తేజోవంతమగు దీపికలు వెలిగించిరి. చూచుటకు వచ్చినవారంద ఱును మహారాజును విడిచి వెడలిపోయిరి. ఇఁక నాగదియందు రోషినారాయును, ఆమె పరిచారికలును మాత్ర ముండిరి. కొందఱు పరిచారిక లుపచారములయందును, కొందఱు రోగికి కావలసిన మూలికాసంపాదనమునను మగ్నులై యుండిరి.

వైద్యుఁడు మరల వచ్చెను. కాని శివాజీ తిరిగి జ్వరము ప్రకోపించి బాధపడుచుండెనని గ్రహించి యీతఁడు కొంచెము భయపడెను. వైద్యుని ముఖవర్ణము మాఱినది. శివాజీ శయ్య ప్రక్కనున్న దంతపుబల్లపై నొక్కచిన్నసీసా యుండెను. ఆసీసా తీసి వైద్యుఁడు భగవంతునిపై భారమువైచి ప్రార్థించి యందలి మందును గొంచెము శివాజీనోటఁ బోసెను. కొన్నినిమిషము లకుఁ బిమ్మట రోషినారా ముసుఁగుతొలఁగించి శివాజీశరీరమును బట్టి చూచి "చెమ్మటలు గ్రమ్ముచున్నవి." అని వైద్యునివైపు నకుఁజూచి పలికెను. భయముతో నున్నవైద్యుఁ డాశాసూచక మగు చిఱునవ్వుతో "అట్లయిన జ్వరమిఁక విడిచిపోఁగలదు." అని పరీక్షించెను.

రోషినారా చేరుమాలాతో శివాజీకిఁ బట్టిన చెమ్మటలు మెల్లగఁ దుడుచుచుండెను. వైద్యుఁడు మందులిచ్చుచునే యుండెను. క్రమక్రమముగా జ్వరము తగ్గి శివాజీకి స్మృతివచ్చు చున్నట్లు చిహ్నములు కన్పట్టఁజొచ్చెను.

"నేనిఁక నుండవలసినపని లేదు. ఈవఱకే మందు లనేక మిచ్చియుంటిని. రాత్రికూడఁ జాలభాగము గడచిపోయినది.

ఇఁక నాతఁడు క్రమముగా స్మృతికి వచ్చును! భయము లేదు.” అని చెప్పి సెలవుతీసికొని వైద్యుఁడు వెడలిపోయెను

తెల్లవాఱుటకుఁ గొంచెముపూర్వము శివాజీ కన్నులు తెఱచెను. అప్పటికి రోషినారా తనకువిసరుచుండుటయుగులాబీ మెల్లగఁగాళ్లొత్తుచుండుటయు ఇతరపరిచారిక లుపచారములు చేసి మందులు గాయములను రాచుచుండుటయుఁ జూచెను.

శివాజీ గొత్తిగిల లేకపోయెను. ఎందువలన ననఁగా, నాతనియొడలంతయునొప్పులెత్తుచుండెను. శివాజీ యొద్ది మొత్తన లోఁ దాను గొణుఁగుకొనుచున్నట్లు రోషినారా గ్రహించినది. ఆమె కొక్కమాటమాత్రము వినఁబడినది. అది యేది? “రోషినారా! ఇప్పుడు మాటలాడవలదు. అది మీకు బాధగనుండును.” అని రోషినారా మెల్లగ ననెను. “మీకు సంపూర్ణారోగ్యము కలిగినపిమ్మట నేను మీమాటలన్నియు విందును.” అని రోషినారా బదులు చెప్పెను.

శివాజీ తిరుగఁ గన్నులమూసికొని నిశ్శబ్దముగనుండెను. రోషినారా విసరుచునే యుండెను. అప్పుడప్పుడు పన్నీరు చిలుకరించుచునే యుండెను.

తెల్లవాఱుసరికి శివాజీ కొక్కగట్టినిట్టూర్పు వినఁబడినది. దానితో నతనికి మెలకువ వచ్చినది కాని యామెవదనమున నున్నగులాబీలు వాడిపోయినవి. కన్నీళ్లతో నేత్రము లొరసి పోయినవి. ఆతనివదనము బాధచే వికలమగుచుండినను, శివాజీ చిఱునవ్వు నవ్వెను. అది హీనమైనదియే! ఆతఁ డెందులకు నవ్వెను?

తా నెంత బాధపడుచున్నను సహింపఁగలఁడు. కానిసత్య ముగ తనమనోహారిణిఁ బ్రేమించునాతఁడామె కాంతిహీనమగు వదనమును జూడఁజాలఁడు. ఆమె సుఖముగ నుంటయే యాత నికిఁ గావలసినది. రోషినారా తనకు సుఖముగనున్నదనుటకై శివాజీ నవ్వియుండవలెను అందువలననే యాతఁడు "రోషి నారా! నాకేమియు బాధలేదు సుఖముగ నున్నది. నీకు భయ ము లేదు. దుఃఖింపకుము" అని పలికెను.

"మంచిది. మంచిది." అని రోషినారా నవ్వెను.

రోషినారా నవ్వులు శివాజీకి పువ్వులవలెఁ గాన్పించెను. ఆశయ్యపై నాతఁడు మరణించిన నది పూలశయ్యకదా యని యాతఁడు తృప్తినొందెను. ఆతని కిప్పుడు సుఖముగ నుండెను. గాయములకు రాచినమందులకంటె నామెనవ్వు వేవిధములఁ బనిచేసెను.

రోషి — నీవు నాకై చాల కష్టపడితివి.

శివా. — నీకొఱకు నాజీవితమును ధారపోసి ప్రాణములు విడు చుటకూడ నాకు బాధకరము కాదు.

రోషి — అవును. అది సరియే! కాని నేను—

శివా — (ఆమెను మాటలాడ నీయక) మనోహారిణీ! ఆయుధ పాణులగుపురుషు లిట్టిగాయము లందుటలో నాశ్చర్యము లేదు. మాకుఁ బ్రాంతమే! ఇట్టివి దేవప్రీతికరము లని నే నెఱుఁగుదును.

ఈమాటలురోషినారాకు సంతోషమును,ఆసంతోషము శివాజీ కానందమును గలిగించి బాధానివారకము లయ్యెను.

రోషి.—ఇట్టికష్టము లెవ్వరు కోరుకొందురు?

శివా.—ఇట్టికష్టములోనే గాయపడినప్పు డానందము నొందిన యాతఁడుమాత్ర మిట్టికష్టములఁ గోరుకొనును.

రోషి.—"ఇడుములలో సుఖమా:" అని యాశ్చర్యము నొందెను.

శివా.—రోగపడినప్పుడు సుఖములేదనియే నీయభిప్రాయమా? అందులకు విరుద్ధముగా నాయురారోగ్యస్థితి నా కానంద దాయకముగ నున్నది. నాజీవితాధారమా! నావలె సుఖము నొందువార లికఁ నెవ్వరున్నారు? రోగశయ్యపై నింత సుఖ మెవ్వరికుండును?

ఈపాలనురుఁగువంటిశయ్యపై నీవంటి యువతీమణి పరిచర్యలందుచున్న నాకంటె ధన్యతము లెవ్వరు? దీనికంతకుఁ గారణము నాగాయములు కావా? నాకనారోగ్యము కలుగుట వలననే నీవంటిమనోహారిణి సపర్యలు కలిగినవి కావా? ఈగాయములే నా కదృష్టదాయకము లైనవి.

అని శివాజీ యూరకుండెను. ఈ వెఱ్ఱిసంభాషణ మచ్చట స్త్రీలోకము నొక్కసారి హాసమహాసముద్రమున ముంచివేసెను. శివాజీ యీవిధముగ నానందసముద్రమున సుఖియగుచుండ, మంకాజీ యేమయ్యెనో చూతమా?



## పండ్రెండవ ప్రకరణము.

శివాజీతో యుద్ధముచేసి పడిపోయినమంకాజీచనిపోయె నని భృత్యులు రాజాజ్ఞ ననుసరించి కోటక్రిందనున్న పీనుఁగుల గుంటలోనికిఁ ద్రోసివైచిరి. కాని లోకమునకుఁ బనికిరానివస్తువులు త్వరగ నశింపవా? మంకాజీ ప్రాణము పోలేదు. ఆపీనుఁగుల వెంటలనడుమ, దుర్వాసనాభూయిష్ఠమైన యారంగమునందు, నాసానాళములున్న జీవులు మృతకళేబరభక్షణ మొనరింపని వైనను జీవింపలేని యాప్రదేశమునం దామంకాజీ జీవములు నిలిచియుండెను. ద్వంద్వయుద్ధము జరిగిననాఁడే యాతని పర్వతశిఖరమునుండి క్రిందకుఁ బాఱవైచిరి కదా! మఱి నాలుగైదు దినముల కాతనికి స్మృతివచ్చినది; కాని కుడిచేయి సంపూర్ణముగఁ బోయియుండుటవలనను,శివాజీ ఖడ్గప్రహారణముల వలన మంకాజీ యెముకలుకూడఁ దెగియుండుటవలనను, శరీరమంతయు నొచ్చి యాతఁడు లేవలేకపోయెను. కష్టపడి లేచి ప్రక్కనేపాఱుచున్న సెలయేటికడకుఁ గొంతవడికిఁ బోయి,దప్పి తీర్చుకొని,యాపర్వతపాదమున నున్న ఫలవృక్షములనుండి రాలియున్న కొన్ని పండ్లుతినియాతఁడుజీవముల నిలువఁబెట్టుకొనెను. తుద కాతఁడు శివాజీని గుఱించి తలపోసెను. ఆతనిపై నాగ్రహము వృద్ధియై, మంకాజీ మొగలాయిలతోఁ జేరి శివాజీని సాధింప నిశ్చయించుకొనెను. శివాజీని నాశన మొనరించువఱకు నిద్రపోనని శపథ మొనరించుకొనెను.

కొంత కాలమునకు మంకాజీ గాయములు మాని యా రోగ్యవంతుఁడయ్యెను. కాని యంగవిహీనతవలన నాతఁ డాతనికే యుపయోగకారి కాఁడు. వానకాలము ప్రారంభ మైనది. మేఘము లురుము నారంభించినవి. ఆవానలలోనే మంకాజీ ప్రయాణమునకు శక్తిలేకపోయినను మొగలాయీల శిబిరప్రాంతములకుఁ బోయెను.

పటకుటీరము లెన్నియో నిర్మింపబడియున్నవి. ఆయుధ పాణులై సైనికులు పహరా నిచ్చుచుండిరి. ఆపటకుటీరముల నడుమ నెత్తైనయొక గుడారముండెను. అదియలంకారములచేఁ దక్కినగుడారములకంటె నధికసుభగత్వముచేఁ బ్రకాశించుచున్నది. అది మొగలాయిసైన్యాధిపతి గుడారమై యుండునని మంకాజీ తలంచెను. అతఁడు మెల్లఁగ నాగుడారమును జేరి, యాతనికిఁ గన్పడిన మొదటిపహరాజవాను నీవిధముగఁ బ్రశ్నించెను. "మీ సేనాధిపతిని దర్శించుటకు వచ్చితిననియాతనితోఁ జెప్పెదవా?" "ఇచ్చట దయచేయుఁ డని" యొకయాసనమును జూపి యాసైనికుఁడు గుడారములోనికిఁ బోయి తిరిగివచ్చి "అయ్యా! సెలవైనది. దయచేయుఁడు." అని చెప్పెను.

లోపల సైస్తఖాను తిరిగి శివాజీ చెదరఁగొట్టిన సైన్యమును బ్రోవుచేసికొనుచుండుటచే నాప్రసంగముమాని మంకాజీని జూచి కూరుచుండుమనెను. పిమ్మట "నీసంగతి సందర్భములఁ బట్టిచూడ నీవు మహారాష్ట్రప్రభుని సందేశహారుఁడవనితోఁచుచున్నది. కాదా? నీపని యేమి?" అని సైస్తఖానుఁ డడిగెను.

మంకాజీప్రత్యుత్తరము నీయక సైస్తఖానుని ప్రక్కనున్న యిరువురభటులను జూడసాగెను. "తొందరలేదు. నీయుద్దేశము స్పష్టముగ నీవు చెప్పవచ్చును" అని సైస్తఖాను హెచ్చరించి "వీరు నాయాంతరంగికులే. నీకు రహస్యభంగము కాదని నేను పూటపడుదును. నీవు చెప్పఁదలఁచినది చెప్పుము. "అని యడిగెను.

అంతట మంకాజీ "ప్రభువర్యా! నాయాగమనకారణము మీకు సంపూర్ణముగ విన్నవించెదను. కాని దానికి ముందు మీరు నాశరీరమును పరీక్షింపుఁ"డని తనశరీరముపైనున్న వస్త్రములఁ దీసివైచెను. ఆశరీరముపైనున్న గాయములు, మానుచున్న మచ్చలను వారికాతఁడు చూపెను "నిన్నింత దారుణముగ గాయములొనర్చినవా రెవ్వరు?"అనిసైస్తఖానుఁ డడిగెను.

మంకా:—(కన్నీరుతో) మిమ్ముల నీరహస్యప్రదేశమునఁ దల దాచుకొనఁజేసిన యాపరమదుర్మార్గుఁడగు శివాజీయే నన్నిట్టి దుస్థితికిఁ దెచ్చినది.

సైస్త:—ఆగజదొంగ నిన్నిక్లెందులకుఁ గొట్టవలసివచ్చినది?

మంకా:—అదియొకదీర్ఘమైన చరిత్రమగును. నన్నిక్కడ రక్షించుట కంగీకరింపుఁడు. నాశరీరము నిట్లువైకల్యమొనరించిన యాపరమనీచుని, నాప్రాణములఁ దీయఁదలంచిన యాదుర్మార్గుని నాచేతఁ బ్రాణములు పుచ్చుకొందును. అందులకు మీరంగీకరింపఁ గోరెదను.

సైస్త:—నేను నిన్నెట్లువిశ్వసింపఁగలను. శత్రువు పలుపోకడలు

పోయి మోసగించుచున్నాఁడు. నీవాతఁడు పంపినగూఢ చారివి కాఁగూడదా?

మంకా:—(కోపముతో) ప్రభువులు నేనసత్యమాడుచున్నట్లె తలంచుచున్నారా?

సైన్య:—లేదు. ఏమైనను నీవు డిల్లీచక్రవర్తిసేనలోఁ జేరి, యాచారము ననుసరించి ఘోరప్రమాణములొనరించి నీశక్తికిఁ దగినవేతనమును బుచ్చుకొనుచుండినచో నిన్ను మాయందనుండనిచ్చుట కభ్యంతరము లేదు. నిన్ను రక్షించుట కప్పుడాటంక ముండదు.

మంకా:—(కొంత యోచించి) అయ్యా! నే నందుల కంగీకరింపలేను. నాకుగాయములన్నియు మానిజీవచేసువఱకు మీరు రక్షింపుఁడు పిమ్మట నేను శివాజీపైఁ గసితీర్చుకొందును. నేను చేయఁబోవు నీదేశద్రోహకరము నపకీర్తికరము నగు కార్యముకొఱకైనను, మీ చక్రవర్తిసేవకుఁడను కాఁజాలను.

సైన్య:—నీకసితీర్చుకొనినపిమ్మట నేమి చేయుదువు!

మంకా:—తిండిమాని మరణించెదను.

సైన్య:—ఏల ?

మం: కా—ఘోరశపథమొనరించి యీ కార్యమునకుఁ బూనుకొంటిని. ఇది తీరిన నాపగతీరును. పిమ్మట నేను బ్రదుకవలసినది లేదు. మీకిష్టము లేనియెడల మఱియొకరిమరుఁగు చొచ్చెదను.

సైస్తఖానుఁడు మంకాజి యాగ్రహమును జూచి యిది నిశ్చయమైన శత్రుత్వమని విశ్వసించెను. "శరణమ్మనుచున్న వీనిని విడువనేల? ఏమో? వీఁడె నాసైనికులసాహాయ్యమువలన శివాజీని బంధించి, యాకీర్తి నాకుఁ గలుగుటకుఁ గారకుఁడు కాఁగూడవా?" అనితలంచెను. "మంచిది! నీవారోగ్యము చెందు వఱకు నిచ్చట నుండవచ్చును. అప్పటి వఱకు నేను శివాజీ నెదిరింపను. పిమ్మట నీవాతనిఁ బట్టఁగలిగితి వానీకష్టమూరక పోనీ యను." "నాకు బహుమానము లక్కఱలేదు. ఆదుర్గనునిరక్త మీకన్నులుచూచిన చాలును. అది మీసాయమునఁ గావలెను" అని మంకాజీ బదులుచెప్పెను

పిమ్మట సైస్తఖానుఁడు మంకాజీకి వలసినయేర్పాటు లొనరించి యాతనికొకవైద్యుని నియమించెను. చక్రవర్తికడ వేతనము తీసికొనని మంకాజీదేశాభిమానమును మాపాఠకులు గ్రహించి నవ్వకుందురా?

---

## పదుమూఁడవప్రకరణము.

మహమ్మదీయపరిపాలనమునందుఁ జక్రవర్తులు మహమ్మదీయులు కానివారిని బెట్టినబాధ లపరిమితములని చరిత్రలు నుడువుచున్నవి. హిందువులు బాధలధికమైన కొలఁది మతరక్షణ దీక్షాపరవశులై పోయిరి. అందువలననే హిందూమహమ్మదీయులకుఁ జీవకాలమువఱకు శత్రుత్వము వృద్ధికాఁజొచ్చినది. రాజ

పుత్రులు మహమ్మదీయపరిపాలన సౌభాగ్యమునందుఁ జేరవలసిన వారైరి. భగవానుదాసువంటి రాజులు తమతనూజాతల ఢిల్లీ చక్రవర్తులకుఁ బెండ్లి చేసిరి. అట్లయ్యు నీజాతులు రెండు నుకలియ లేదు. అక్బరువంటి రాజనీతిజ్ఞుఁడు ముసలితనమునందుఁ జూపిన ప్రేమము నాతఁడే బాల్యమున హిందువులయెడఁ జూపలేదు. అక్బరు స్నేహితునివలెఁ గన్పట్టినశత్రువు. ఆతనిదుర్మార్గములకుఁ బట్టపగ్గములు లేకపోయెడివఁట ! ఔరంగజీబు సింహాసనస్థుఁ డగుట మహమ్మదీయులకు సంతోషదాయక మయ్యెను. ఈసమయమునందే యవనాంతకుఁడగు శివాజీ విజృంభించెను.

మంకాజీ క్రమముగ నారోగ్యవంతుఁ డయ్యెను కాని యాతని కుడిచేయి పూర్వమువలె శక్తివంతము కాలేదు. తన గదిలో నొక్కఁడే కూరుచుండిన సైస్తఖానుఁ డొక్కనాఁడు మంకాజీని పిలిపించెను. మంకాజీని కూరుచుండుమని ఖానుఁ డాతని క్షేమసమాచారములనడిగెను. “నాకిప్పు డారోగ్యము కలిగినది నీకు భగవంతుఁడు మంగళము నిచ్చునుగాక!” అని మంకాజీ బదులు చెప్పెను.

సైస్త:—దుర్గ మిప్పుడు ముట్టడింపవచ్చునా?.

మంకా:—ఆహా !

సైస్త:—ఇచ్చట దారులు మాకుఁ దెలియవు. దుర్గద్వారమునకుఁ బోవుమార్గములఁ దెలియఁబఱచెదవా ?

ఈమాటలవిని మంకాజీ యూరకుండెను. ఆతని కేమియు దోఁపలేదు. చాలవఱకుఁ జింతించెను.

"మంచిది! ఊరకుంటి వేల? మాటలాడ వేమి?" అని సైన్యాధ్యక్షుడు షాయిస్తఖానుఁ డనెను.

మంకా:—మీ రడిగినవిషయములఁ దెలుపుటకు నేనెన్నఁడును పూనుకొందునని తలంపకుఁడు.

సైన్యా:—అట్లయిన శివాజీని నీవెట్లు పట్టుకొందువు?

మంకా:—ఆతనిఁ బట్టవలసిన యగత్యము లేదు మీ సేవకులలో నొకరిని నాతోఁ బంపుఁడు. నేనా శివాజీతల ఖండించి మీ కర్పించెదను.

మంకాజీ మాటలకర్థము తెలియక ఖానుఁ డత్యాశ్చర్యపడెను. పిమ్మటఁ గొంతవడి కాతఁడు "నీవు చెప్పునదేదియో నాకుఁ దెలియుట లేదు. నీవు శివాజీతలఁ దెత్తునందువు. కోటకుఁ బోవలసినమార్గములఁ జెప్పనందువు, దీని కంతకు నర్థమేమి?" అని పలికెను.

మంకా:—నేనుదానికి సమాధానము చెప్పలేను. నేను శివాజీని దండింపఁదలఁచితిని నే నా వాగ్దానముతోనే మీ రక్షణమునఁ జేరితిని నేనొక్కవ్యక్తిదోషముకొఱకు మాజాతినంతయు నాశనము చేయ నిష్టపడను. నా కా యోచన ముందుఁ దోఁచ లేదు. కావున నిఁక నన్నావిషయమై వేధింపకుఁడు.

మంకాజీమాటలు ఖానునకుఁ గోపముఁ దెప్పించెను హిందూమతనాశకులగు మహమ్మదీయుల కాతని జాత్యభిమానమే కోపకారణమయ్యెను; కాని బుద్ధిమంతుఁడగు ఖానుఁడు కార్యవాదికావునఁ గోపము నణఁచుకొనియెను.

సైన్యస్థః—మంచిది, నీవు దుర్గరహస్యములఁ జెప్పుట కిష్టములేని యెడల చక్రవర్తికొలువునఁ జేరుటకేమి?

మంకాః—నా కాయభ్యంతరమేమియు లేదే. చక్రవర్తి గర్భ శత్రువును జంపఁ బూనుకొనియుంటిని కాదా?

సైన్యస్థః—నీ వొకసైనికుఁడవు కారాదా? అట్లే రాజభక్తితో వేతనమునందుచు నీసద్వృద్ధిని నెఱవేర్పవచ్చును.

ఈమాటలు మంకాజీకిఁ గోపముఁదెప్పించెను. ఆతని ముఖవర్ణము మాఱినది.

మంకాః—నా రా? జెవరు

అని మంకాజీ గర్జించెను.

సైన్యస్థః—ఢిల్లీచక్రవర్తి!

మంకాః—మేము మహమ్మదీయుల సేవకులము కాము. ఔరంగ జేబు నారా జెట్లు కాఁగలఁడు?

సైన్యస్థః—నీ వాతనిసైన్యమునఁ జేరితివి! ఇప్పుడు వ్యతిరేక ముగ నెట్లు ప్రవర్తింపఁగలవు?

మంకాః—అయ్యా! నే నిచ్చటకు నాపగఁదీర్చుకొనుటకువచ్చితి కాని నేను నాజాతినే సర్వనాశనము చేసికొనఁదలఁచినంత దుస్థితికి దిగిపోలేదు. మహమ్మదీయుల ధనమున కాశపడిన వానివలె నేను భానిసనై నాజాతిని నశింపఁజేసికొను దేశ ద్రోహినగుదు ననుకొనుచున్నావా? మహారాష్ట్రజాతి కా యపకారము నేదుర్మార్గుఁడు చేయఁ దలఁచునయ్యా! నా యుద్దేశము నెఱవేఱుటకు నేను మొగలాయీలకు సాయ

మొనరింతునని చెప్పితిని. అంతమాత్రమున నేను చక్రవర్తి గొప్పతనమును సర్వాధికారము నంగీకరింతునా?

ఈమాటలతో సైస్తఖానుఁడు మండిపోయెను అతఁడప్పటికిని యోచించెను. తుద కిట్లు పలికెను. "నీవు వేతనమును దీసికొనుము, మానుము అది మాకంత నష్టము లేదు. నీవు మాకు దుర్గ రహస్యములఁ జెప్పనను చున్నావు. కానిమ్ము. నీ విప్పుడు నీకువలసినంత దీసికొనిపోయి నీపగఁ దీర్చుకొనివచ్చెదవా?

మంకా:—నే నందులకు సర్వసిద్ధముగ నున్నాను.

పిమ్మట నాతఁడు కొందఱు మహమ్మదీయసైనికులఁ దీసికొని దుర్గము వైపునకు వెడలిపోయెను.

---

## పదునాల్గవప్రకరణము.

మంకాజీ వెళ్లినతరువాత సైస్తఖానునకుఁ గొన్ని యాలోచనములు తోఁచెను. ఆతఁ డాలోచింపఁ దొడఁగెను. మంకాజీ యవినయసంభాషణమును మండిపడిన ఖానున కీయాలోచనము లాతనికి మహమ్మదీయసైనికుల సాయమంపినప్పుడు తోఁపలేదు. ఇప్పుడాతని కొకసందియ మొదవెను. "ఈమంకాజీ నిశ్చయముగ శివాజీని చంపునా? లేక దొంగవేషమువైచి కొంతసైన్యమును దీసికొని పోయినాఁడు. ఆసైన్యమునంతయు నీయడవులలోనికిఁ దీసికొనిపోయి నాశనమొనర్చునా?" ఈవిధముగఁ దలఁచి భయము నొందసాగెను. తుదకుఁ దన్ను దా

నిందించుకొనెను. ఔరంగజేబువలెనే యాతని యుద్యోగులును గ్రిందివారిని నమ్మరు. ఇతరుల నమ్ముటయే! ఇతరులయెడ విశ్వాసములేనివా రెల్లరు పరులు తమయెడనట్లే ప్రవర్తించుచున్నారని సందియమొందుచుండుట స్వభావము.

ఎట్లయిన నీయుపద్రవమునుండి సాధ్యమైనంతవఱకు రక్షణమొందుట కాలోచింపవలెనని తనతోవచ్చియున్న సేనాధిపతుల నందఱ రావించి వారితో నిట్లనెను "మీ రందఱును నేను చక్రవర్తిచే నిచ్చట నియోగింపఁబడితినని యెఱుఁగుదురు. రోషినారాను గనుఁగొనుటకును శివాజీనిబట్టుకొనుటకును మన మిచ్చటఁ బ్రయత్నించు చున్నాము. ఇప్పుడు మహారాష్ట్రులు మనకంటె సైన్యసాధనబలమునం దధికులు కారని మీరెఱుఁగుదురు. వారి కునికిపట్లగు దుర్గములనుండి రహస్యమార్గముల వచ్చి మనల నుపాయముచేతను మాయముచేతను జయించుచున్నారు. ఈయుపాయము నెఱిఁగియే దల్వారుఖాను జయసింగుల నాసాయమున కంపఁ జక్రవర్తి తలంచుచుండెను. కాని వారిప్పటికిని రాఁజాలని కారణములు తెలియుటలేదు. మన మశ్రద్ధతో నుండుటఁజూచి శత్రువు లానాఁడు మనల నెట్లు చిందరవందర చేసినదియు మీరు చూచియున్నారు. అపరాభవమును బొందియు మన మిప్పు డూరకుండవలసినదా? మన మేమి చేయుదము? చక్రవర్తికి లోఁబడినప్రదేశము లన్నియు బందిపోటుదొంగలు ప్రవేశించి కల్లోలపఱచుచున్నారు. మన కిప్పుడు వలసినంతసైన్య మున్నది. ఆదొంగలఁ బట్టవలెను. ఇంత బలముండియు మన మీమహారాష్ట్రుల లొంగఁదీయుట

కుపాయముతోఁ బకున్నది. ఈక్షణమున మీయాలోచనమును మంత్రాంగమును నాకుఁ బ్రయోజనకరము లగును. ఏమి చెప్పెదరు ?" అని ఖానుఁడు తనసేనాధిపతుల నడిగెను.

వారందఱు కొంతసే పాలోచించి కొంతవడి కిట్లు ప్రత్యుత్తర మొసఁగిరి. "మనము శివాజీనిఁ బట్టనియెడల మన ప్రయత్నము లన్నియు వమ్మగును. ఎట్లో మన మాతనిఁ బట్ట వలెను. పశువులు ప్రవేశింపని దుర్గమారణ్యములను మహారాష్ట్రపశువులు ప్రవేశింతురు. వా రక్కడ దాఁగుదురు. అట్టి వారు మనతో నెన్నటికిని బహిరంగయుద్ధమునకు రాసాహసింపరు. కావున నెట్లో వారి నట్టిదొమ్మియుద్ధమునకుఁ బురికొల్పవలెను అప్పుడు మనకు జయము నిశ్చయము. జయసింగు ముష్నగువారు వచ్చికలసిన మన మహాసైన్యముతోఁ గోటల ముట్టడింప వచ్చును.అప్పుడు వారు తప్పించుకొనఁజాలరు." "అందఱు కలిసి చేసినయాముట్టడివలన మనకేలాభ ముండును ?" అని సైస్తఖానుఁడ నెను. 'అట్లయిన నింకొకవిధము నాలోచింపుఁడు' అని సేనాధిపతు లనిరి.

ఈవిధముగ వారు చాలవఱకు యోచించి తుదకు మంకాజీ తీసికొనిపోయిన సైనికుల వెనుక నొకగూఢచారునిఁ బంపి మార్గమును గుర్తించి రమ్మని పంపుటకుఁ దీర్మానించి యా వెనుకనే ప్రచండసైన్యమును రాత్రిబయలుదేఱఁదీయ సిద్ధముగనుండిరి. మంకాజీతోఁబాటు వీరును దుర్గమును సులభముగ ముట్టడింపవచ్చునని వారితలంపు.

---

## పదునేనవ ప్రకరణము.

---

రోషినాఖాను శివాజీ పట్టుకొనినకొండలోయ యరణ్యా పరివృతమని మనమెఱుఁగుదుము. మంకాజీ యాలోయలోనికి వచ్చి తనకార్యము నెఱవేర్చుకొనుటకదిముఖ్యస్థానముగ నేర్ప ఱచుకొనియెను. అచ్చటకుఁ జేరినపిమ్మట తాను మొగలాయీ లకుఁ జేసిన వాగ్దానము ననుసరించి కార్యసాధన మొనర్చుట యెట్లని యోచింపఁదొడఁగెను. క్రమముగ భానుఁ డపరాంబు ధిని గ్రుంకుచుండ, వేఁడిమయూఖములు చల్లఁబడి యదృశ్య మగుచుండెను. మేఘరాజి నీలపుటాకసముక్రింద వ్రేలాడు చుండ నందుపై భానుకాంతి ప్రతిఫలింప నాయరుణరుచులచే మాఱి యవియన్నియు బంగరునీరానినవస్త్రములు పఱచి నట్లు మనోహరముగ నుండెను. పక్షులు చెట్లకొమ్మలపైఁ జేరి మృదుమధురగానములఁ జేయుచుండెను. ఆకుజొంపములు, లత లును, వీచుచున్న గాలికిఁ గదలి కర్ణరంజకమగు వింతధ్వనులఁ గలిగించుచుండెను. లతలనుండి సగమువిడిచిన పుష్పగుచ్ఛములు మనోహరపరిమళకారకములై వాయుమండలమంతయుసజ్జనుల కీర్తివలెఁ బ్రాకి దూరమునఁ గూడఁ దమయునికి ద్యోతకమగు నట్లు చేయుచుండెను. లోయలో చీఁకటివ్యాపించిపోవుచున్నది. అది యిఁక నంధకారబంధురమై పోవును. అప్పుడు మంకాజీ యీవిధమైన యాలోచనములఁ జేయసాగెను. "ఇంక నిచ్చట నాఁగుట మంచిది కాదు. కొన్ని నిమిషములలో నిదియంతయుఁ

గారుచీఁకటుల కిమ్మగును " అని తన మొగలాయీమిత్రులతో "మిత్రులారా ! లెండు ! ఇఁకఁ జీఁకటిపడిన కంటకములవంటి యీరాళ్లలో మీ రడుగు కదల్పలేరు. నాఁ బోయినత్రోవను నెనువెంట రండు! "

మంకాజీ వెంట వారు నడచుచుండిరి కొంతవడికివా రా లోయదాఁటిరి. దుర్గపరిసరమున నున్న యొకగొప్పయరణ్యము లోనికి వారు ప్రవేశించిరి. వారు సవ్వడికలుగకుండ గనుపెట్టి యుండిరి. సూర్యుఁ డింకఁ గనఁబడఁడు. అప్పు డధికారిచెవిలో మంకాజీ గుసగుసలాడెను. అతని నొక్కని దీసికొని మంకాజీ దుర్గమునకుఁ బోవుమార్గమును జేరెను అక్కడకు వచ్చి తన జాతివారికి మాత్రమే తెలియునట్టి యొకధ్వని చేసెను. అప్పుడు పర్వతశిఖరమునుండి యొకయుయ్యల దిగినది. ఆతఁడు దుర్గము లోనికిఁ బైకిఁ బోయెను. ఆతనిఁ జూచి దుర్గరక్షకులు జీవించి యుంటివా యని యాశ్చర్యపడిరి. ఆతని నెన్నియో ప్రశ్నలు వారడిగిరి. కాని వాని కన్నిఁటికి నాతఁడు యుక్తియుక్తముగఁ బ్రత్యుత్తరము లొసఁగెను. వా రాతనిమాటలవలన ద్రోహి కాఁడని నమ్మి విడిచిరి. ఆతఁడు శివాజీయున్న మందిరముకడకుఁ బోయెను. రోషినారాతో ముచ్చటించుచున్న శివాజీకడ కొక భృత్యుఁడు వచ్చి "తమదర్శనమునకు మంకాజీ వచ్చియుండె" నని చెప్పెను. శివాజీ యాశ్చర్యము నొందెను. అంతట నాతఁ డాకొండపైనున్న మూలికలసాయమున బ్రతికియుండు నని తలఁచి యీవలకువచ్చి యాతనిఁ జూచి "మంకాజీ ! నీ వెట్లు బ్రతికితివి ?" అని యడిగెను.

మంకా.—మహాప్రభూ! (అని కాళ్లపైఁ బడి) నాకుఁ దగిన ప్రాయశ్చిత్త మైనది. దేవర నాకుఁ దగినశిక్ష యొసంగిరి. నే నాకందకమునఁ బడి పొందినబాధలు దేవుఁ డెఱుఁగును. ఐనను భవానీదేవి కృపవలన బ్రతికితిని. పశ్చాత్తాపము నొంది మీయనుగ్రహమును బడయ నిటకు వచ్చితిని.

శివా.—నీ వెట్లు బ్రతికితివి?

మంకా.—దేవరవా రదియే వినవలసియున్నది. చిత్రమైనది. నా కాపడియున్నస్థితిలో నొకవిచిత్రమైనస్వప్నము వచ్చినది. అందు నరకలోకమంతయు నాకుఁ బ్రత్యక్షమైనది. దేవరవా రొనరించినగాయములలోఁ గొన్నిపురువులుదూరి బాధపెట్టుచుండఁ బ్రాణములు పోవుచున్నవని తలంచి భవానీదేవిని నాపాపములు సైరింపఁ బ్రార్థించితిని. ఇంతలో దూరముగ నొకగొప్పధ్వనియైనట్లు నా కాస్వప్నమున వినఁబడినది. రక్తనేత్రయగుదుర్గ పండ్లుపటపటఁ గొఱకుచువచ్చి నేలపైఁ దన్ని 'మూర్ఖుఁడా! నాప్రియభక్తుఁడగుశివాజీకి ద్రోహముచేయఁదలంచిన నీకింకను శిక్షయొనరించెద'ననెను. 'తల్లీ! క్షమియింపు'మని నేఁగోరితిని. ఆమె కొంతవడికిఁ గరుణించి 'నీవు శివాజీకడకుఁ బోయిక్షమాపణ వేఁడుకొనుము. అట్టి యుద్దేశము నీకుండిన నదిగో యాకనఁబడుచున్న మామిడిచెట్టుకడకుఁ బొమ్ము! ప్రతిదిన మాఫలము భక్షించి గాయములు మానినవెనుక శివాజీపాదములపైఁ బడుము. అప్పటికిఁగాని నీపాపములకుఁబరిహారము లే'దనెను. "మంచిది

తల్లీ! యని నమస్కరించి కన్నులు తెఱచుసరికి దేవియదృశ్య యయ్యెను. ఆతల్లి యాజ్ఞననుసరించి మీాకడకు వచ్చితిని. మీాఁద దేవర చిత్తము." అనెను.

శివాజీ జాలిపడి "నిన్ను క్షమియించితిని. నీ కీదుస్థితికి నీ బుద్ధియే కారణమైనది" అని బుజ్జగించెను.

"నాకు దుర్గములోనుండి దేవరపాదసేవ చేయ ననుజ్ఞ యీాయవలెను. భవానీదేవి"అని మంకాజీ పలుకుచుండ "ఆవిష యము తేపుచెప్పెదను" అని శివాజీ లోనికి వెడలిపోయెను.



## పదునాఱవ ప్రకరణము.

రాత్రి చాలవఱకుఁ గడచిపోయినది. కోటలోని వారంద ఱును గాఢనిద్రాపరవశులై యుండిరి. అప్పుడు మంకాజీ తాను వచ్చిన కార్యసాఫల్యమునకు బయలుదేఱెను. ఆతఁడు దుర్గ రక్షకులుతప్ప మిగిలినవారందఱు నిద్రించుచుండిరని గ్రహిం చెను. దుర్గరక్షకు లాయుధపాణులై పహారా నిచ్చుచుండిరి.

"నీ వెవ్వఁడ వెక్కడకుఁ బోయెదవు?" అని పోవుచున్న మంకాజీనిఁ జూచి యొకభటుఁడు భీకరముగఁ బ్రశ్నించెను. "నన్నే యెఱుఁగవా?"అని భటునిఁజేరి మంకాజీ ప్రశ్నించెను. "క్షమియింపుఁడు. ఇంతరాత్రివేళ నెచ్చటికిఁ బోవుచున్నారు?" అని భటుఁడు వినయపూర్వకముగ వంగియడిగెను. "నే నీరాత్రి

భటు లప్రమత్తులై యుండినది పరీక్షింపుమని మహారాజుచే నియోగింపఁబడితిని ” అని మంకాజీ యనెను.

ఈ ప్రత్యుత్తరము భటుని నిరుత్తరునిఁ గావించినది. మంకాజీ నిశ్చలముగ వెడలిపోయెను. మంకాజీ ద్వారములు, కక్ష్యాంతరములును దాఁటి కోటలోనికి సులభముగ దారినిఁ జూపుచోటికి వచ్చెను.

మంకాజీ పూర్వము మహారాష్ట్ర యోధులలో నొకఁడు. అతఁడు గొప్పసైన్యాధిపతి. ఆతనిఁ బలుకరించుటకైన దుర్గరక్షకులుసాహసింపలేదు. అంత ప్రాముఖ్యముగలచోట గస్తీకాయుచున్న భటునియందు విశ్వాసము చాలక మంకాజీ తనమొలనున్న బాకును దీసి యొక్కదెబ్బతో నాతనిఁ బొడిచివేసెను. ఈవిధముగఁ దనకడ్డము లేకుండఁ జేసికొని యచ్చటనున్న యుయ్యేలఁ గ్రిందికి దింపెను. మొగలాయిసైనికులు మంకాజీ యనుజ్ఞ ననుసరించి యచ్చట నిలువఁబడియుండిరి. ఉయ్యేల వచ్చుట యొకమొగలాయి చూచి యుయ్యేలలోఁ గూరుచుండి పైకిఁబోయెను. ఈవిధముగఁ జాలినంతమందిభటులుపైకివచ్చిన పిమ్మట నిఁకశివాజీనిఁ బట్టుట సులభము రండని బయలుదేతెను.

మంకాజీపర్వతపాదమున సైన్యఖాను పెద్దసైన్యముతోఁ గాచియుండెనని యెఱుఁగఁడు. మంకాజీ వెడలుటతోనే యచ్చటనున్న తక్కిన మొగలాయీసైనికులు తమసైన్యము నంతయు, వెంటవెంటనే యుయ్యేలలోఁ బై కెక్కించిరి.ఆకస్మికముగఁ దమవారెందఱో వచ్చుటఁజూచి జయాభిలాషులై మొగలాయీలు

దుర్గములోపల విజయధ్వానము లొనరించి. "అల్లాహూ!" అని యఱచిరి.

దుర్గరక్షకులు బాకాలధ్వనివిని, కోటశత్రువులకుఁ జిక్కినదని,యూపిరివిడువకుండ శివాజీపరుండినచోటికిఁ బోయి వచ్చిన యాపద నెఱుకపఱచిరి. శివాజీ యాపదను మించినధైర్యముతో లేచెను. ఆతఁ డీవఱకే విజయధ్వానముల వినెను. కోటలోనివారందఱు నీకల్లోలమునకు దద్దరిలి లేచిరి.

శత్రువప్పుడే ముట్టడి ప్రారంభించె నని దుర్గములో నున్న మహారాష్ట్రసైనికు లందఱు నాయుధశాలకుఁ బరువెత్తుకొని పోయి యాయుధముల ధరించి వచ్చి తిరుగఁ బడిరి. "భవానీ మాతకుజై ! మహాదేవు! " అను వీరికేకలు "అల్లాహూ!" కేకలతోఁ గలసి కొండలు ప్రతిధ్వనించుమహానాదమొకటి యుద్భవించెను.

ఆదినము దుర్గమునందున్న మహారాష్ట్రసైనికులకంటె నీ మొగలాయీ యతిథులు నాలుగురెట్లు మించియున్నను, మహారాష్ట్రులు భీకరయుద్ధమొనరించి సంపూర్ణముగ మొగలాయీల నోడించిరి. మహారాష్ట్ర లొక్కుమ్మడి మోహరించి యొకప్పు డెదుట, మఱియొకసారినడుమ నింకొకతరివెనుకను గ్రమ్మి మొగలాయీల నుగ్గాడిరి. ఒక్కొక్కదెబ్బ కొక్కమొగలాయీసైనికుఁడు క్రిందఁబడిచచ్చుచుండెను.ఆకటికచీఁకటితోనున్న నూతన ప్రదేశమునందు మొగలాయీ లేమియుఁదెలియక దుర్దశనొంది దురపిల్లిరి. సైస్తఖానుఁ డీయవస్థలో నేమిచేయుటకును దోఁపక, యిఁక వీరిని నిర్జించుట దుర్ఘటమని తెలిసికొని చింతనొం

డుచుండెను. చాలసేపాలోచించి శత్రువును బాధించుట కిదియే పరమసాధనమని నిశ్చయించుకొనెను. మహారాష్ట్రసైనికులును, భటులు నున్నపూరియిండ్లకగ్గి ముట్టింపఁదలంచెను. అట్లు చెప్పుట తడవుగ నిప్పుముట్టించిరి. దానితో పెద్దమంటలు లేచి యుద్ధరంగము కొంతవంత మగుటయే కాక కోటలోనివారిని గొప్ప గందరగోళములోనికి దింపెను.

ఇప్పుడు మరల మొగలాయీలు యుద్ధపుబాకాల నూది యుద్ధములోనికి దుమికిరి సంఖ్యచే నధికులగు మొగలాయీల ముట్టడి యీసారి భీకరముగనుండెను. ఇదియే వారారాత్రి పొందఁగలిగిన విజయము.

యుద్ధరంగమునుండి శివాజీ రోషినారాకడకుఁ బోయెను. ఇఁకఁ దననాశనము నిశ్చయమనుకొనెను.

శివాజీనిఁజూచుటతోనే యామె "యీమహాప్రళయ మేమి?" అని యడిగెను. "మీతండ్రిసైన్యము కోటముట్టడించినది. వారికీసరికి సంపూర్ణవిజయము కలిగియుండును." అని రౌద్రాకారమున నున్నశివాజీ ప్రత్యుత్తర మిచ్చెను.

చాలభయముతో "నిప్పుడు వారేమిచేయుదురు?" అని రోషినారా ప్రశ్నించెను. "ఇచ్చటనుండి తీసికొనిపోవుదురు." అని శివాజీ బదులుచెప్పెను. "నీవు తత్క్షణ మట్లయిన పాఱిపొమ్ము? ఏమనఁగా: దుష్టుఁ డగుచక్రవర్తి నిన్నుఁ జంపక మానఁడు." అని రోషినారా యేడువసాగెను.

"నిన్ను విడిచినబాధ నేనెట్లోర్తును?" అని శివాజీకన్నుల నీరుపెట్టుకొనెను.

రోషినారా కొంతవఱ కూరకుండి శివాజీచేతిలోఁజేయి వైచి "హృదయేశ్వరా! రోషినారా నీయదియ. ఎచ్చటనున్న నెప్పటికైన నీయదియై యుండునని నమ్ముము. కాని యదృష్ట ము——" ఒకముంతేఁడు నీళ్లామెకనుదమ్ములఁ గ్రమ్మెను. కాని యది లెక్కగొనక "కాని నిన్నెప్పటికిని నేను కలిసికొనలేని యెడల నిన్నే రాత్రిపవళ్లు ధ్యానించుచు నుండెదనని నమ్ముము. ప్రాణనాయకా! అధ్వని సమీపించుచున్నది. నీవు తప్పించుకొనుము. ఇదియే నిన్ను గట్టిగఁ బ్రార్థించునది." అని రోషినారా తొందరగ నుడివెను. రోషినారాపైఁ బ్రణయపూరితములును, జాలిగలిగించునవియును హృదయవేదనకరములు నగుచూపులఁ బఱపి శివాజీ నిష్క్రమించెను. శివాజీకొఱకు మొగలాయీలు కోటయంతట వెదకిరి. కాని వారాతనిఁ గనుఁగొనలేక పోయిరి. మహారాష్ట్రసైనికులుకొందఱు శివాజీతోడను కొంద ఱింకొకవిధముననుదుర్గమును విడిచి పోయిరి. తరువాతచర్య తరువాతప్రకరణమునఁ గలదు.



## పదునేడవ ప్రకరణము.

సైస్తఖాను స్వయముగ వచ్చి దుర్గముపట్టుకొనుటచూచినమంకాజీకి దుఃఖ మపరిమితమయ్యెను. మహారాష్ట్రులెన్ని విధములఁ బ్రయత్నించినను విజయులు కానందుల కాతఁడు దురపిల్లెను. వారు పోవుట యీతనికి విచారమొదవించెను.

ఆతఁ డిట్లు తలఁపోయసాగెను. "శివాజీని జంపలేకపోయినదే కాక, కోటలోని కీమహామ్మదీయులఁ దెచ్చుట నాదేమిపౌరుషము? తమప్రాణములైనఁ బోఁగొట్టుకొని, కీర్తికొఱ కనేక దేశోపకారములగుపనుల నిర్వర్తింతురు. అయ్యో! నేనెంతబుద్ధిహీనుఁడను! నామాతృదేశమునకు ద్రోహ మొనరించితినే! కటకటా! నాశత్రువుపైఁ బగఁదీర్చుకొనవచ్చి నేనెట్లు చెడితిని! నా ప్రయత్నములు వ్యర్థగుటయే కాక దేశస్థులీప్రాంతములకు రాకుండఁ జేసినపాపమున కొడికట్టుకొంటినికదా! ఇసీ! నాజన్మ మెందులకు? నే నెట్టి కిరాతకృత్య మొనరించితిని?"

సైన్యాధిపతియగు మంకాజీ యిట్టిదీర్ఘవిచారమున నుండెను. ఈదుఃఖభార మాతనికి భరింపరాని దయ్యెను. ఆతఁడు పశ్చాత్తప్తహృదయముతో నొకవిజనమందిరమునకుఁ బోయి యాఁడుదానివలె బోరుమని యేడువసాగెను. ఆతనిబుద్ధియొక్కడనో జాఱిపోయినట్లాతఁడుతలంచెను. పాపమునకుఁ బశ్చాత్తాపము నొందినహృదయమున ద్రవించుజలమే పరిహారము కదా!

విజయమునొందిన మొగలులు దుర్గమునందలిగదు లన్నియుఁ బరీక్షించి వెలగలవస్తువుల దోఁచుకొనుచుండిరి. వారు స్వభావముచేఁ గ్రూరులు, బుద్ధిలోపము కలవారు. వారియుద్ధములందలి విజయఫలితము లరులస్త్రీధనములఁ జెఱచుటయే! వారిసచ్ఛీలము వారలోడిపోయినవారిని బాధించుటయందే ద్యోతకముకదా! ఇప్పటికి దుర్గమంతయు స్వాధీన మొనరించు

కొని సైస్తఖానుసాహేబుగారు తనసైనికుల కిట్లనియె. "ఆబంది పోటువొంగ కనఁబడఁడే ! ఏమిది ! ఆతఁడు పాఱిపోయెనా? లేక యుద్ధమునఁజచ్చెనా? దీపములఁ దీసికొని మీరంద ఱీ దుర్గమునుపరీక్షింపుఁడనియాజ్ఞాపించుచున్నాను. ఆతఁడుదొరక కున్న మనకీదుర్గవిజయమువలన లాభమేమియున్నది? ఆతని నెట్లయినఁ బట్టుకొనవలెను. శత్రువులభార్యల సొత్తులఁగూడ వెదకి తెండు. అవియేమి? ఆ కృతఘ్నుఁడగు మంకాజీ కనఁబ డఁడే! ఈతనికి గర్వమధికమే! సంకెలలు తగిలించి యాతుచ్ఛ నిటకు ముందు తీసికొనిరండు." పిమ్మట సైస్తఖాను తనకుమారుఁ డగు అబ్దుల్ ఫతేఖానునిఁ బిలిచి రోషినారా రాజకొమారి తను వెదకితెమ్మని పంపెను.

ఈయాజ్ఞ వినఁబడుట తడవుగ సైనికులు కోటలో నలు మూలలకుఁ బరువెత్తిరి. కాని వారిప్రయత్నములు నిష్ప్రయో జనములు కావలసియున్నది. శివాజీ యావఱకే యదృష్టముపై నమ్మకముంచి తప్పించుకొని పోయెను. వారి కాదుర్గమునం దొక్క-మానవుఁడు కాని స్త్రీకాని కనఁబడలేదు. చాలసేపటికి ఫతేఖాను మాత్రమురోషినారాను గనుఁగొనఁ గలిగెను. ఆమె దుస్తులనుబట్టి యాతఁడామె రాజకొమరితకావలయుననితలం చెను. ఆమె దుఃఖముతోఁ దలవంచుకొని యుండెను. "అమ్మా! మీచెఱతప్పినది. మిమ్ములఁబట్టినయాదుర్మార్గుఁడగు శివాజీపాఱి పోయినాఁడు. ఎక్కడికిఁబోయెనో యేరికిఁ దెలియదు. మీరు ఢిల్లీకిఁ బోవుటకు సేనాధిపతి యిప్పుడే శిబికను సిద్ధముచేసి యున్నాఁడు." అని ఫతేఖాను రోషినారా నుద్దేశించి పలికెను.

ఒకతెయుఁ గోటలోనుండి యేమిచేయును? మేలిముసుఁగు వేసికొని రోషినారా ఫతేఖానునితో బయలుదేరెను.

రోషినారా సైస్తఖానునికడకు వచ్చుటకుముందు మొగలాయీసైనికులు మంకాజీనిఁ బట్టుకొని యీడ్చుకొని వచ్చిరి. మంకాజీ యాకారము భయంకరముగ నుండెను. కన్నులనుండి నీరువరదలు పాఱుచుండెను. ముక్కురంధ్రము లెగసిపడుచుండెను. పండ్లుబిగించి మంకాజీ రౌద్రాకారుఁడై యుండెను. ఆతఁడెవ్వరినిఁ జూచుటలేదు. కాని సైనికులు చుట్టుమూగి కోడిగ మాడుచుండిరి.

"ఓరి దుష్టుఁడా! పాపి! నీవు నన్నే మోసగింపఁ దలఁచితివిగా?" అని సైస్తఖానుఁ డనెను.

మంకా:—నే నేమిటక్కరిపనులు చేసితి నందువు?

సైస్తః—ఆగజవోంగ! దయ్యముభక్తుఁ డెక్కడ నున్నాఁడు?

ఈమాటలు మంకాజీ రక్తనాళములలోనికిఁ గాల్చిన సూదులవలెఁ బ్రవేశించెను. ఐనను మెల్లగఁ జలిపిడుగులవంటి మాటలతో నిట్లనెను. "తుచ్ఛమైనతురకవునీవు! నేను నీకసాయి కత్తికిభయపడను లొంగను. నీచసంభాషణమున మాదైవముల దూషించు చున్నావు. మంచి దట్లొనరింపుము. కాని నేను నా నీచపునాలుకతో దేవునిఁ దలఁచి యానామము నపవిత్ర మొనరింపను." మంకాజీ కీమాటలవలనఁ గొంత వేఁడి చల్లారినది. ఆతఁడు మరలనిట్లుపలికెను. "ఈ ప్రపంచమునందు నానీచకార్యమునకుఁ బరిహారశక్తిలేదు. కావున సాధ్యమైనంతత్వరలో నన్ను జంపించి నా కుపకారము చేయుము."

సై_స్త:—(నవ్వుచు) అది పిమ్మట నాలోచింతము. కాని శివాజీ యెక్కడున్నాఁడు?
మంకా:—అది నేనెఱుఁగను.

ఎవ్వరును మాటలాడ లేదు.

సై_స్త:—నీకు బ్రతుక నిష్టము లేదా?
మంకా:—ఒక్కనిమిషమైన బ్రతుకనిష్టము లేదు.
సై_స్త:—నీవు తురకవైనచో నిన్ను క్షమియించెదను. చంపను. నీవే యాలోచింపుము. దయ్యములఁ బూజించుట తప్పు.
మంకా:—మహమ్మదీయపిశాచమా! నీవు మామతమును మిక్కిలి నిందించుచున్నావు. నన్నీ బంధములనుండి విడిచి నీవట్లు మాటలాడినచో నిన్నీకత్తితోఁ బొడిచి చంపి కసి తీర్చుకొందును.
సై_స్త:—నేను భయపడుట లేదు.

సై_స్తఖానుఁ డొకసైనికునికి సన్న చేసెను. వెంటనేకొంత 'ఫులావు' తీసికొనివచ్చి "మహమ్మదీయుఁడవగుదువా? కావా? అని యామాంసముకలసినయన్న మాతనినోటభటులచే ఖానుఁడు క్రుక్కించెను.
మంకా:—దేవుఁడా! నేను చేసినదానికిఁ బ్రతీకార మెట్లొనరించితివి!

ఇంతలో మహమ్మదీయు లూరకుండ లేదు. ఆతని నొక బాకుతోఁ బొడిచి యిఁక నీభూభార మాతనివలన నధికముకాకుండఁ జేసి వారిభూతదయాళుత్వమును, ఉపకారప్రతీకారమగుకృతజ్ఞతాస్వభావమును బ్రకటించి కృతకృత్యులైరి.

---

## పదునెనిమిదవ ప్రకరణము.

మహారాష్ట్రుల నందఱిందఱిమినపిమ్మట మొగలులసైన్యాధిపతి, శివాజీకోటలోఁ బ్రవేశించి, తనసైన్యమే యిదివఱకుఁ బాడుచేసినకోటభాగముల బాగుచేయుటకు వడ్రంగులను,తాపీపనివాండ్రను నియమించెను. శివాజీ యుద్ధములోఁ జనిపోలేదని నిశ్చయముగఁ దెలిసికొనిరి. ఎంత వెదకిన నాతనిజాడ లేమియుఁ దెలియలేదు. కావున శివాజీ మరల వచ్చి సైన్యముతోఁ గోటకొఱకుఁ బోరాడునని తలఁచి తననమ్మినబంట్ల ననేకుల ముఖ్యస్థానముల నియమించి కడుజాగరూకతతో దుర్గమును రక్షించుచుండెను.

ఈక్రొత్తనగరునం దీవిధముగ క్షేమముగ నున్నసైస్తఖానుఁడొకలేఖవ్రాసి,యీసంతోషవార్త ఢిల్లీచక్రవర్తికిఁ దెలియఁజేసెను. రోషినారాచే నొకలేఖ వ్రాయించెను. చదువరులకు రోషినారా ప్రస్తుతమనస్థ్సితిఁ దెలిసికొనఁ గోరిక యుండవచ్చును. అదియెట్టిదో త్వరలోఁ దెలియఁజేయుదుము.

రోషినారాను విడిచి శివాజీ యెటుపోయినదియు నేరు నెఱుఁగరు.సైస్తఖానుఁడు రాజఘుడదుర్గమును మాత్రము పట్టుకొనఁగలిగెను.అది శివాజీకున్న యసంఖ్యాకములగు దుర్గములలో నొక్కటి. అయినను రాజఘుడము చాలముఖ్యమైన దుర్గము.న్యాయపరివ్యాప్తికిని రాజకీయవిషయములకు నర్హములగు

సుందరమందిరము లీదుర్గమున నెన్నియేని కలవు. శివాజీకీదుర్గ నష్టమువలనఁ గలిగినవిచార మూహ్యమే కాని వర్ణింపఁ దరము కానిది. మొగలులు కోటనుబట్టుకొనుట కొనరించినద్రోహమూర్గ మాతని కాగ్రహ మొదవించెను. ఆదుర్గముమరలనాతనికిఁజిక్కిన యెడలద్రోహియగు ఖానునిసైన్యమునం దొక్కపురువు లేకుండ జంపి; వీరి వినాశనవర్తమానము ఢిల్లీశ్వరునకుఁ జెప్పువాఁడైన లేకుండఁ జేయ శివాజీ నిశ్చయించుకొనెను. కోట శత్రువులకుఁ జిక్కినమఱినాల్గుదినములవఱకీవిధముగ నాందోళన మొందుచు నానాఁడాకస్మికముగ రామదాసుస్వామి యాశ్రమముకడకు శివాజీ వచ్చెను. ఈవిషయము మొగలుల కేమియుఁ దెలియదు. వారు శివాజీ యెచ్చటనుండినదియుఁ దెలిసికొనలేకపోయిరి.

శివాజీ వచ్చుసరికి రామదాసుస్వామి దర్భాసనాసీనుఁడై సమాధియందుండెను. ఆతఁడు కన్నులు తెఱచుటతోనే శివాజీ యాతనిపాదములపై బొరగి సాష్టాంగనమస్కారమొనరించెను. పిమ్మట లేచి యుచితస్థానమునఁ గూరుచుండి పెదవి మెదపక యూరకుండెను.

ఆతఁ డూరకుండుటఁ గని రామదాసుస్వామి యిట్లనియెను. "బిడ్డా! నీదుర్గము మొగలులు పట్టుకొనిరని వింటిని. నీవు పూనినయీమహాకార్యమునం దభివృద్ధిమార్గమునువచ్చు నడ్డంకుల నీవు సరకుచేయరాదు. ఆపత్సమయమునఁ గార్య విముఖులగువారు ధీరులు గాఁజాలరు. జయముగోరువాఁడు రెండుమూఁడుసారు లపజయమొందినను వెఱవరాదు. బిడ్డా! ధైర్యము వహింపుము."

శివాజీ యీమాటలు వినెను. కాని ప్రత్యుత్తరమీయ లేదు. శివాజీ యప్పుడు రోషినారాను దలంచుకొనుచుండెను. ఆతని కామెయెడబాటు విచార మొదవించుచుండెను. ఆమె చిఱునవ్వును ఆమె కోమలకంఠస్వరమును ఆమెనుండి వేఱుపడ వలసినప్పుడున్న మనస్థితియు నతనికి జ్ఞప్తికివచ్చిహృదయమును శతధావ్రయ్యలు సేయుచుండెను. ఈయూహలతో నాతనికిం గన్నీరుమున్నీరయ్యెను.

రామదాసుస్వామి కీగొడవ తెలియదు. దుర్గనష్టమున కాతఁడు దుఃఖించుచుండెనని యూతేఁడనుకొనెను. వారు కొంత సేపటివఱకు మాటలాడుకొనలేదు. కొంతవడికి రామదాసు స్వామి "జయాపజయము లదృష్టమునకు వశమైనవి. కావున వానికి దుఃఖసంతోషము లనవసరములు. అధైర్యమును విడిచి గమ్యస్థానమును జేరఁ బ్రయత్నించువాఁడే పురుషుఁడు," అనెను.

"ఈపరిస్థితియం దేమిచేయవలసినదియు నిర్ధరించుటకే తమకడకు వచ్చితిని" అని శివాజీపలికి యొకనిట్టూర్పు విడిచెను. "నీతీర్మానమునకు నేసంతసించితిని. మొగలుల బహిరంగయుద్ధమున జయించుట దుస్సాధ్యము. పైఁగా నది మనవినాశమున కీపరిస్థితులయందుఁ గారణము కావచ్చును." అని రామదాసు స్వామి నుడివెను. "మనకోట తిరిగి మనకెట్లు చిక్కును?" అని శివాజీ యడిగెను. "ఆలీ ఆదిల్షావలె నొనరింపుము. నీశత్రువు దుర్గమునుండిపోవును." అని రామదాసుస్వామి బదులుచెప్పెను. శివా:—మీయాజ్ఞననుసరింతును. నేను నట్లే చేయఁదలంచితిని.

రామ:—ఎంతత్వరగఁ జేసిన నంతమంచిది.

శివా:—దాని కాలస్యము లేదు. చారుల నంపి పెక్కుచోట్ల మూలబల ముండఁజేసితిని. నే నీరాత్రియే దుర్గమును ముట్టడించెదను.

రామదాసుస్వామి యోచించుచుండెను. "గురుమహారాజా! మీ రేమి యోచించుచున్నారు?" అని శివాజీయడిగెను.

రామ:—ఆలోచించుట కేమున్నది? నీవు దుర్గమును దిరిగి యెట్లుపట్టుకొందువు ? నీ కీదుర్గ మెట్లుస్వాధీన మగును?

శివా:—దానికొఱకు మీకు విచార మక్కఱలేదు.

రామ:—మొగలాయీలు జయమునొందినప్పటినుండియు దుర్గము నతి భద్రముగ సంరక్షించుకొనుచున్నారు. నీవు దుర్గమునుద్యభంగమునకుఁ బ్రయత్నించిచూచునట్లు వారికిఁ దెలిసెనా వారూఱకుండరు.

ఈమాటలు శివాజీ పెదవులపైఁ జిఱునవ్వు కలుగఁ జేసెను. "గురుమహారాజా! ప్రపంచములో నన్నెఱిఁగినవారందఱు నాయుపాయమునకు మెచ్చుకొందురు. కావున మీకావిషయములో సందేహ మవసరములేదు."

రామ:—నే నందువలననే మఱిమఱి యోచించుచున్నాను. నీవుపాయశాలివని మొగలాయీలుకూడ నెఱిఁగియున్నారు.

శివా:—వారి కింక నాసమాచారము పూర్తిగఁ దెలియదు. నాధీబల ప్రదర్శన మీరాత్రి జరుగును. వా రప్పుడు నన్నె

ఱుఁగఁగలరు. అప్పటివఱకు నానేర్పును వారెఱుఁగరని నమ్ముఁడు. నేఁటిరాత్రితో వారు పశుబలముకంటె ప్రతిభ గలపురుషునియుపాయ మధికమని గ్రహింపఁగలరు.

రామ:—నీవు చేయఁదలఁచిన విధానమును జెప్పుము.

శివా:—నిన్నను మొగలాయిసైన్యములోఁ జేరిన యొకమహారాష్ట్రోద్యోగిని జూచితిని. ఆతనితో నేను జాలసేపు మాటలాడితిని. నేఁటిరాత్రి యాతనిసైన్యబలమే దుర్గరక్షణమున నుండును. వారు మనల నెదిరింపరు. పైఁగా మనలోఁ గలియుదురు.

రామ:—నీవట్టి వాగ్దానములపై నెట్లాధారపడియుండఁగలవు?

శివా:—నమ్మకపోవుట కేమున్నది? వారు ధనముకొఱకు మొగలాయిలఁజేరిరి. కాని వారికి మనమున మనయందుఁ బ్రేముడి కలదు. మనక్షేమమును వారు కోరుచున్నారు. స్వాతంత్ర్యముకొఱకే రపేక్షింపరు ? ఆసైనికోద్యోగికిఁ దగినట్టు విషయములన్నియుఁ జెప్పితిని. మేము మొగలాయీల జయించినయెడల నాతనిసైన్యమును మన సైన్యములోఁ జేర్చు కొందుమని చెప్పితిని. ఆతఁడు హృదయపూర్వకముగ సాయపడుదునని చెప్పియున్నాఁడు. ఆశచేఁ బ్రోద్బలముకలిగి మన న్రిత్యాజీపాల్కారును మొగలాయీ సైనికవేషమున కోటకావలివారిలో నుంచివచ్చితిని. ఆయుద్యోగికి సైదోడుగ నాతఁ డున్నాఁడు. కావున మీరు నన్నాశీర్వదించి యీ పందెములో నేను జయమునొందఁబంపెదరా ?

రామ:—కాని మొగలాయీలు చాలమంది మనసైనికులు గుమిగూడుటఁజూచి యనుమానింపరా?

శివా:—నే నాయపాయము కలుగకుండునట్లును, మొగలాయీలు మనమున సందియ మొదవకుండునట్లును తగిన యేర్పాటు లొనరించితిని.

ఇట్లుచెప్పుచు శివాజీ రామదాసుస్వామిచెవిలో నేదియో చెప్పెను. సంతోషముతో రామదాసుస్వామి "సర్వేశ్వరుఁడగు భగవంతుఁడు నీయందుఁ గరుణించి నీకు విజయప్రాప్తి నొసఁగూర్చునుగాక!" ఈయాశీర్వాదములతో రామదాసుస్వామి శివాజీకి సెలవొసంగెను. శివాజీ మ్రొక్కి వినయముతో సెలవు తీసికొని వెడలిపోయెను.

---

## పందొమ్మిదవప్రకరణము.

పునహాపట్టణములోనికిఁ బెండ్లివారు వచ్చుచుండిరి. వందలకొలఁది పల్లకుల యొంకారములును, వివిధవాద్యవిశేష క్రేంకారములును, నడుమనడుమ తూర్యముల భాంకారములును, బెండ్లిజనముతోఁ గ్రమముగాఁ గలిసిపోవుచున్న ప్రజల క్రేంకారములును మిన్నుముట్టుచుండెను. పల్లకివెంట నిశితకుంతధారులగు సేవకులు జయజయ ధ్వానములతోఁ బెండ్లికొమరు పల్లకిముందఱవచ్చుచుండ వందలకొలఁదిపల్లకులకుసాయముగ గణగణారవములతో వేలకొలఁదిబండ్లు వెనుకవచ్చుచుండెను.

దర్పముకొఱకుఁగావలయు నాయుధధరులగు నాశ్వికులు చిత్రముగ నశ్వముల నడిపించుచు వచ్చుచుండిరి. పెండ్లివారందఱు తాంబూలములు నములుచుండిరి. వారు పట్టణములోఁ గొంతభాగమునడచివచ్చినపిమ్మటఁబల్లకుల నాఁపించిరి. పెండ్లిపల్లకినుండి వరుఁడు దిగి"భాజీప్రభూ! మనసన్నాయి వాండ్ర నేర్పు నీవచ్చినవారికిఁ జూపు మనుఁ"డని ప్రోత్సహించెను. చిత్తమని భాజీ ప్రభువు సన్నాయివాండ్రను బిలిచి వినోద మొనరింపుమనెను. వా రారంభించినది మొదలు ప్రజలు సంతసపడసాగిరి. మొగలాయీసైనికులందఱును నాగస్వరమును గొత్తగవినిన యడవిపాములవలెఁ దల లూపుచుండిరి. మొగలాయీసైనికులు క్రొత్తవారగు హిందువులతో మాటలాడుట లేదు. ఇది యంతయుఁ జూచుచుఁ దనప్రయత్నము సఫలతనొందుచున్నది కదా యని సంతసపడుచున్న పెండ్లికొడుకును జూడఁదలఁచిన వారెవ్వరుందురు ? అతఁడే మనశివాజీ ! నిజముగ నాతనికిఁ బెండ్లి జరుగుటలేదు. ఈ వేషమునవచ్చి మొగలాయీల కన్నులఁ గప్పి యెప్పుడు రాత్రియగునా యెప్పుడుకోట ముట్టడింతునా యని కనుపెట్టియుండెను.

సహ్యాపర్వతపంక్తిపైఁ జీఁకటులు వ్యాపింపఁదొడఁగెను. శివాజీతనప్రయత్నములపై నుండెను చీఁకటి క్రమముగా హెచ్చిపోయినది మొగలాయీలందఱును వెడలిపోయిరి. పల్లకివాండ్రు, బండ్లవాండ్రు, డోళ్లవాండ్రు, నందఱు యోధులే వారు మాఱువేసముల నుండిరి. శివాజీ యుచితసమయమునఁ బర్వతపాదమునకు సైన్యముతోఁ బోయి సన్న చేసెను. పైనున్న త్ర్యాజీ

పల్కీ డోకయుయ్యేలను క్రిందకు దింపెను శివాజీ దానిలోఁ గూరుచుండెను. వెనువెంట యోధులుగూడ రఘునాథపంతు, తానాజీమాలస్రా, భాజీప్రభువు, మొదలగు వారందఱుపోయిరి. వారందఱు ససంఖ్యాకములగు నుయ్యేలల దింపి పైకి వేల కొలఁది మహారాష్ట్రసైనికుల నెక్కించిరి. వేత్రధరులు, యోధులు, రుంజలవాండ్రు, మొదలగువారు గుఱ్ఱములపై నెక్కి నిమిషములలో వచ్చి వారివారిస్థానముల నలంకరించిరి. ఎట్లయిననేమి మ్రాలిసైన్యమంతయుఁ గోటలోనికిఁ బ్రవేశము నొందిరి. కోటబురుజులపై కెక్కినసైనికులందఱును జేరి "మాత భవానీకి జై" యని యఱచిరి. మఱికొందఱు "మహాదేవునికి జై" యనినిద్రించుచున్న మొగలాయీల చెవులు గింగురుపోవునట్లఱచిరి. అప్పటికి సైస్తఖాను దుర్గప్రవేశ మొనరించి నాలుగుదినములు మాత్ర మైనది. వారి కాకొండపై విశేషము లే పరిచయము కాలేదు. ఈయాకస్మికపుఁ గేకలకుఁ గారణము తెలియక భయముతో మొగలాయీలు లేచిరి. మొగలాయీసైన్యము కంటె నాలుగురెట్లధికముగ నున్నమహారాష్ట్రుల నెదిరించిన వారిపాట్లు వర్ణనాతీతములు.

మొగలాయీసైనికుల నందఱ నాశన మొనరించుచుండ నడుమసైస్తఖానునికుమారుఁడగు నబ్దుల్ ఫతేఖానుఁడు తాను జేర్చినని క్షేపమును విడిచి యుద్ధమున కుఱికి శివాజీనిఁ గలిసి కొనెను. "ఓరీ! తుచ్ఛుఁడా! నీవు దుర్గము తిరిగి పట్టుకొనఁదలచితివా!. ఇదిగో! ఈ దెబ్బతో నీపని సరి." అని కత్తి నెత్తెను. శివాజీ యించుకేనియుఁ జలింపక యెత్తినకత్తి సహితముగఁ

నాత డింక నూటలాడకుండం గ్రిందకుం బడునట్లు నఱికెను సైస్తఖానుండు విజయమునం దాసవిడిచి దుర్గకుడ్యములపై నుండి భీమానదిలోని కుఱుకుటకుం బరువెత్తుచుండెను. మంకాజీని వెదుకుటయందుమగ్నులై నకొందఱు మహారాష్ట్రసైనికులాతని వెంబడించిరి. సైస్తఖానుండు స్వల్పయుద్ధము నొనరించి భీమానదిలోని కుఱికెను. మహారాష్ట్రులు ఱాళ్లురువ్వి యాతని బాధించిరి. ఆతండు పాఱిపోవుటలోం గొన్ని చేతివేళ్లుమాత్రము తెగినవి. అతం డెచ్చటకుం గొట్టుకొనిపోయినదియు విచారించుట కిది సమయము కాదు.

మొగలాయీలనందఱ నురుమాడి,యింక తుఱకపురుగు లేకుండంజేసి శివాజీ కోట నాక్రమించుకొనిన పిమ్మటం దన వాగ్దానము ననుసరించి తనకు సాయమొనరించిన మహారాష్ట్రుల కుద్యోగము లొసంగి రక్షించెను. మొగలాయీల సేవయందు వారొందినకష్టములం దెలుపుచు, మంకాజీ దురవస్థను వర్ణించి చెప్పిరి. దేశద్రోహియగు మంకాజీ దుర్మరణమును విని శివాజీ "హిందూరాజ్యలక్ష్మీ! నీ వీగోమారణపరులగు కఱకుతుఱకల నీయెదురఁటొమ్ములపై విహరింప నెట్లు సహించితి వమ్మా" అని విచారింపసాగెను.

సైస్తఖానుం డోడిపోయినవెంటనే శివాజీ సూరతునగరముపై దండెత్తి యానగరమునందలి సంపదల దోంచుకొనెను. సూరతునగర మప్పటికి మొగలాయీలు పరిపాలించుచుండిరి. ఈసమయమునందే శివాజీతండ్రి యగుషాజీ మృతిఁబొందెను

ఉచితకర్మ లొనరించినపిమ్మట శివాజీ తన రాజ్యమునందు వాడుకలోనున్న నాణెములపైఁ దనపేరు వేయించెను. తనసైన్యమునం దుద్యోగులకు పారసీకనామములకు బదులు సంస్కృత నామము లుంపించెను.

శివాజీ యిట్లు పట్టభద్రుఁడై నిత్యాజీ పాల్కారుసాయమున నౌరంగబాదు, అహమ్మదునగరము, గోకర్ణము, గోవా, బెంగుళూరు మొదలగు పట్టణములఁ బట్టుకొనెను. ఆవఱకే పట్టణములు మొగలాయీలకులోఁబడియుండెను. ఇప్పుడవి తన రాజ్యమునఁ గలుపుకొనెను. శివాజీ యధికారమునందున్న సముద్రసైన్యముయుద్ధపుటోడలతోఁ బోయి మక్కాకుఁబోవుచున్న మహమ్మదీయయాత్రికు లున్నయోడ నొకదానినిఁ బట్టుకొని యపరిమితముగ ధనము దోఁచుకొనెను.

శివాజీ జబ్బుపడినపిమ్మట నారోగ్యమునకై కాశ్మీరదేశమునకుఁ బోయియుండెను. దక్కనులో నీతొందరలు జరుగునప్పటి కౌరంగజీబు కాశ్మీరమునందే యుండెను. సైస్తఖానునకుఁ బిమ్మట సుల్తానుమజ్జాముసు దక్కనుగవర్నరుగా నియమించిరి. కాని యతఁడు శివాజీతొందర లణఁపఁజాలకపోయెను. తన రాజ్యమునందుఁ గొంతభాగము పోయినందుల కౌరంగజీబు రిచ్చపడెను. మక్కాయాత్రికులగతి వినినపిమ్మట మహమ్మదీయుఁడగు పాదుషాగారికిఁ గోపము హెచ్చిపోయినది. ఔరంగజీబు వెంటనే జయసింగు మహారాజున కొకలేఖ వ్రాయించెను. జయసింగు రసపుత్రప్రభుఁడు. "విజయపూరునవాబుపైఁ దరలివెడలుటకు ముందు శివాజీనిఁ బట్టుకొని యినుపబోనులో నుంచి ఢిల్లీకిఁ

బంపవలెను. ఇది ముందు చేయవలెను.” అని జయసింగునకు లేఖనంపెను దలావ్రఖానునితోఁ గలిసి జయసింగీలేఖఁ జూచిన వెంటనే పునహాపట్టణమును జేరి పురందరపురమును బట్టుకొనఁ జూచుచుండెను. దారిలో నున్న సింహగడమును ముందాతఁడు ముట్టడించెను.

గొప్పయోధుఁడగు జయసింగాకస్మికముగ వచ్చుటఁ జూచి మహారాష్ట్రులు విభ్రాంతినొందిరి. యుద్ధకుశలులగు రసపుత్రుల నెదిరింప వారి సహాయశక్తులఁ బ్రయత్నించిరి. కాని మహారాష్ట్రులు జయింపలేదు. కావున నిందులకు జయసింగుతో సంధి చేసికొనుటయే శివాజీకి మిగిలినదారి అందువలన శివాజీ యొకనాఁడు రసపుత్రశిబిరమునకు వెళ్లి వారితో సంధిమాటలాడుటకొకదిన మేర్పఱుప నిశ్చయించుకొనెను.

ఆమఱునాఁడే శివాజీ యొంటరిగా బయలుదేరి నిరాయుధుఁడై రసపుత్రశిబిరమును ప్రవేశించి జయసింగుకడకుఁ బోయెను. శివాజీ శత్రుశిబిరప్రవేశమునకు జయసింగాశ్చర్యము నొందెను. శివాజీ జయసింగుతోఁ జాలసంగతులు ముచ్చటించెను రసపుత్రులైన మీరు మొగలాయీలకు లొంగిపోవుటయే కాక మీహిందూమతము వారలగు మహారాష్ట్రులపై దండెత్తుటలో మీరు సాయమొనరించుట యన్యాయమని చెప్పెను. ఉత్తరమున రసపుత్రులును, దక్షిణమున మహారాష్ట్రులు నెదిరించినచో మహమ్మదీయు లేమియుఁ జేయఁజాలరనెను. వేషభాషలు వేఱని మనము వేఱుపడియుంటచే మహమ్మదీయులు మనలో నొకరి నింకొకరిపైఁ బంపి మనవలననే మనలను జయించి దేవి

శజులగు మొగలాయీలు మనపరిపాలకు లగుచున్నారని నచ్చఁ జెప్పెను. జయసింగు శివాజీమాటల కంగీకరించిన తాను సంధి యొనర్చుట కధికారము లేదనియు మహారాష్ట్రులు చక్రవర్తికి వశ్యులుకావలెననియుఁజెప్పి "మీమాటలవలన నామనస్సు మారినది. మీరుచక్రవర్తితో మిత్రులుగానుండి, వారిని దర్శింప ఢిల్లీకి వచ్చెదరా?" అని శివాజీ నడిగెను. "రాకేమి? పాదుషా నన్ను గౌరవముచేయు" నని శివాజీ పలికెను. "అట్లయిన నేను చక్రవర్తిపైఁ గత్తికట్టి మీపక్షమున నుందు" నని జయసింగు పలికెను ఆపద్ధతికిఁజిఱునవ్వుతో శివాజీయంగీకరించెను. అప్పుడు జయసింగు శివాజీ తనకు సాయపడి బీజపూరునవాబుతో యుద్ధమొనరించుటకును వచ్చినధనములో నాల్గవవంతు శివాజీ కిచ్చుటకును సంధిచేసికొని చక్రవర్తికిఁదెలియఁజేసెను. చక్రవర్తి యంగీకరించెను. బీజపూరుయుద్ధఫలితములు పాఠకులు చరిత్ర వలన గ్రహింతురని తలఁచి మనకథానాయికయగు రోషినారా యేమిచేయుచున్నదో చూచుటకుఁ బోవుదమని మాపాఠకుల యనుజ్ఞను వేఁడుచున్నాము.

---

## ఇరువదియవప్రకరణము.

రోషినారా ఢిల్లీనగరము సుఖముగఁజేరెను. పుష్పగుచ్ఛమునందుండునాయకపుష్పమువలె వనితాలోకమున కలంకారముగ నుండినయామెమోహనకరలావణ్యముకాని యపరూప

సౌందర్యముగాని యామెకడ నిప్పుడు లేదు పరిష్కృతమై సర్పాకారమున నామెభుజస్కంధము నలంకరించెడి యలకదామ మిప్పు డట్లు లేదు. ఆదినములలో నామె శరీరపుసోయగము నతిశయింపఁ జేయునట్టి యామొఖముల్ లాగుకాని ఆపట్టురైక కాని ఆచమికీచొక్కాయి కాని ఆసువర్ణరత్నాభరణములుగాని, యామె యిప్పుడు ధరించుట లేదు. ఆమెకోమలములైనయవయవములు స్రుక్కి ధూళిధూసరితములై పోయినవి. ఆమె కమలములవంటినేత్రములు కన్నీటి వర్షధారలచేఁ బీడితములైనవి. అప్పు డంతమనోహర మందహాసములనీను పెదవు లిప్పుడు శోకసూచకములై యెండి వివర్ణములైపోయినవి. ఆమెచికురజాలము చీకాకుపడి దుమ్ముపట్టిపోయెను. ఆభరణములఁ దాల్చిన గుఱుతులే మిగిలియున్నవి. భవిష్యజ్జీవనమునందలి సౌఖ్యరంగముల నామె యిప్పుడు తలపోయు చుండుట లేదు. సంతోషమామెకు దూరముగఁ బాఱిపోయినది. ఆమెకిప్పుడు శాంతిజలము కన్నీరు కన్నీరే! అక్కటా! కర్మము నెవ్వరు త్రెంపఁగలరు? రోషినారా యిప్పుడు చెఱసాలయందున్నది. ఆమెకీఖైదుఖానావచ్చినదెందులకు? తనజనకునియెదుట నిర్భయముగ నామె శివాజీసుగుణసంపదలఁ బొగడినది కాదు. నుడివినది. అంతఃపురమునందున్న— తనతాతగారినికూడ నుంచినచెఱసాలయందే తన్నుంచినందులకామె సంతసించినది. కట్టా! ఇరువురును ఖైదీలు. ఇరువురును దుఃఖముననుండిరి. వారిరువురకు భేదము లేకపో లేదు. షాజహాను దుఃఖమున క్రోధాగ్నియు, రోషినారాదుఃఖమున యువతి కావున విరహాగ్నియు ప్రియునివిశ్లేషదుఃఖమున మిశ్రమైయున్నది.

చాలదినములవఱకు షాజహాను రోషినారాతో మాట లాడ లేదు. పరమదుర్మార్గుఁడగు తనతనయునిబట్టి తనయెడ మంచి యభిప్రాయముతో నుండునా యని యాతఁడు తలంచెను. కాని కొన్ని దినములలోనే రోషినారా చర్యవలనను, మాటల వలన నామె యెడఁ గనికర ముదయించెను. వారిరువురు నొకరి భావము లొకరు విప్పి చెప్పుకొని దుఃఖించుచుండిరి. రోషినారా శివాజీని ప్రేమించినదని షాజహాను విని సంతసించెను; కాని యాతఁడామెకు సుఖము కలుగున ట్లేమి చేయఁగలఁడు?

తనకొడుకుల నందఱఁ జంపి సింహాసనమెక్కిన యలంగీరు చర్య లాతని నేమిచేయలేవు? తానే సౌందర్యవంతముగ నొనరించినపట్టణమున సామాన్యమానవునివలెఁ జెఱయందుండుటయే కాక తాను నిర్మించినమయూరసింహాసనముపైఁ దనదుష్టపుత్రుఁడు కూరుచుండినిరంకుశముగఁ బరిపాలించుచుండినయలంగీరుచర్య లాతనిహృదయమును మాడ్చివేయుచుండెను. విధిని నిందించుచు మనుమరాలితోఁగాలక్షేప మొనరించుచు నాతఁడు దినములు పుచ్చుచుండెను.

రోషినారా యోగిని వేషమునఁగాని, పురుష వేషమునఁగాని, చెఱనుండి తప్పించుకొని పోయి శివాజీనేవిధముగనైనఁ జేరఁదలంచి యుండెను. కాని యట్లొనరింప ధైర్యము చాలక యుండెను ఏమిసిలుగులపాలగుదునో, యెక్కడఁబట్టువడుదునో ఎట్లు శివాజీని గలిసికొందునోయని యామెకు భయ మొదవెను. గులాబీతో శివాజీ కోటయందుఁ గడపిన సౌఖ్యభాజనములగు

దినము లామెకు జ్ఞప్తికి వచ్చెను తనప్రియుఁడు నిస్తులప్రేమమునఁ దన్నుఁ జేరునప్పు డాతనిని నిరాకరించి వేధించిన విషయ మామెకు జ్ఞప్తికి వచ్చి చేతికందినమాణిక్యమును నిరాకరించిన నాకీ శిక్ష యర్హమైనదియే యని నొచ్చుకొనును.

ఇట్టిస్థితిలో నొకనాఁడు శివాజీ ఢిల్లీనగరమునకు వచ్చినట్లు పాజహాను రోషినారాతోఁ జెప్పెను. ఆమె మొదటనమ్మలేదు. తుదకుఁ దాతగారికి నేత్రపర్వముగ నామె వదనము వికసించెను. "నీవొకటి రెండుదినములు వేచియుండుము. ఇంతలో శివాజీ నీతండ్రి నిదర్శించును. పిమ్మట నాతఁడు నిన్నాతనికిచ్చిపరిణయ మొనరింపవచ్చును. నీవీలోపున మాఱువేషమునఁ బోయిన నెటునుండి యెటువచ్చునో?" అని ధైర్యము చెప్పెను. రోషినారా యాశాపూరితహృదయమున నిమిషములు లెక్కించుకొనుచు, శివాజీ దివ్యమూర్తిని ధ్యానించుకొనుచు నేసమయమున నేశుభవార్తవచ్చునో యని కనుపెట్టుకొనియుండెను.

మఱునాఁడే శివాజీ యౌరంగజేబును దర్శింప నిశ్చయింపఁబడినది. ఉచితకాలమున శివాజీ పాదుషాసభకుఁ బయనమయ్యెను. కాని చక్రవర్తి యాతని కట్టిసమయములఁ జేయవలసిన స్వాగతోచితక్రియల జరుపలేదు. కొలువుతీర్చియున్నసుల తాను కడకు శివాజీపోయి యుచితరీతి తనమన్ననలఁ దెలిపి కూరుచుండెను. హిందూసభ్యులందఱు శివాజీమూర్తినిఁ జూచి సంతసించుచుండిరి తుమ్మెదఱెక్కల వంటి నల్లనిగడ్డమును, సువర్ణమయమగు శిరోవేష్టనమును, రత్నాలంకారములును, వెడద కన్నులును, నల్లనిభ్రూయుగ్మమును, దర్పమగు దిరీసులును

గలిగి మయూరాసనమునఁ గూరుచుండియున్న యౌరంగజీబు మూర్తిపై శివాజీదృష్టులు నిల్పియుండెను.

ఇంతలో నొకఁడు లేచి 'శివాజీ కైదువేల సైనికులపై మన్సబుదారీ యుద్యోగమును జక్రవర్తి ప్రసాదించెను' అని ప్రకటించెను. దానిపై శివాజీ లేచి "నేను స్వతంత్ర ప్రభుఁడను. మీ క్రింద నుద్యోగమునకు నే రాలేదు. జయసింగు సంధి పత్రము ననుసరించి వచ్చిన నన్ను మీరిట్లు గౌరవపఱచుట తగ" దని శివాజీ యగ్నికణములు నేత్రములనుండి వెలువడ నాసములదర ముకుపుటంబులు విరళితములగునట్లు నుడివెను. పాదుషా నవ్వుచు "నుద్యోగమిచ్చి గౌరవించుట తప్పా? జయసింగుతో నెట్లు సంధిచేసి కొంటివి!" అని యలంగీరు నవ్వుచు నిర్లక్ష్యముగఁ బలికెను. "బీజపూరుయుద్ధమున నేనుసహాయపడకున్న నీసరికి దక్కనులో మీ రాజ్య మంతమయ్యెడిది. నేను స్వతంత్ర ప్రభుఁడనై స్వతంత్రుఁడువచ్చి దర్శనమొనరించునట్లు వచ్చితిని కాని యుద్యోగమునకుఁ గాదు. నాకేవిధమైన యగౌరవము జరిగినను జయసింగు మీపైఁ గసితీర్చుకొందునని శపథము చేసియున్నాఁడు." అని శివాజీ పలికెను.

"అట్లయిన నతనికి వ్రాసి ప్రత్యుత్తరము తెప్పించెదము. అంతవఱకుండుఁ" డని పాదుషా పలికెను.

"నాసైన్యమున కీనీళ్లు పడవు కావున సైనికులు మహారాష్ట్రమునకుఁ బోవుదురు. నే నొక్కఁడ నుందు"నని శివాజీ పలికెను. మఱియు మంచిదనుకొని శివాజీ మాటల కంగీకరించెను. ఈవిషయములన్నియు రోషినారా జాలరులనుండి పరికిం

చుచునే యుండెను. తనసైన్యమునంతను బంపివేసిన శివాజీ మూర్ఖుఁడని ఫాదుషా నవ్వుకొనెను. ఏవిధముగ శివాజీభరతము పట్టుదునని యలంగీరు తలపోయుచుఁ గొలువు చాలించెను. రోషినారా యేమియుఁ దోఁపక చెఱసాలకుఁ బోయెను శివాజీ తనవిడిదిగృహమునకు వెడలిపోయెను.

---

## ఇరువదియొకటవ ప్రకరణము.

జనానాలో నున్నతనగదిలో నొంటరిగా మఱునాఁడు సాయంకాలమున ఫాదుషా కూరుచుండియుండెను లేఖనసాధనము గదిలో నమర్చియుండిరి. తనచేతితో నొక కలమును బట్టుకొని యౌరంగజేబు తాను వ్రాయవలసిన సంగతులను గుఱించి యోచించుకొనుచుండెను. ఆతనితీ రపాయకరముగ నుండెను.

జయసింగునకు నిన్న శివాజీ పలికినపలుకులు కాని యా సమాచారముగాని వ్రాయుట యుక్తము కాదని యాతఁడునిశ్చయించుకొనెను. లేనియెడల జయసింగాడినమాటలు సత్యములని ప్రత్యుత్తరము వచ్చినయెడల నప్పుడు శివాజీని దానను కొనునట్లు చంపుటకు వీలుండదు. తనకు జయసింగు వాగ్దానము తెలిసికూడ నిట్లు ప్రవర్తించెనని జయసింగు విన్నచోఁ జక్రవర్తి కాతఁడు ప్రబలశత్రువగును ఈకొఱవినిఁ గొని తెచ్చుకొననేల? జయసింగు బలవంతుఁడు. తన కనేకమహోపకారములు

చేసినవాఁడు. ఆతనితో శత్రుత్వ మపాయకరమైనది. బల వత్సైన్యోపేతుఁడగు రసపుత్రు నేల శత్రునిగా నొనర్చుకొనవలెను? కావున రోషినారా నెత్తుకొనిపోయిన నేరమో మఱియొకటియో కల్పించి జయసింగు సాక్ష్యముపై శివాజీనిఁ గొఱతవేయింపవలెనని పాదుషా నిశ్చయించుకొనెను. ఆతనికి మరల సందేహము తోఁచెను జయసింగు తనయిష్టము ననుసరించి సాక్ష్యమీయకుండినన్నో యని. అట్టియెడ సమాయకుఁడగు జయసింగు తనకు మహోపకారియైనను ఆతనిఁ జంపి వేయవలసినదే యని పాదుషా తీర్మానించుకొనెను.

తుదకు పాదుషా తనపుత్రునిపేర నొకజాబు వ్రాసెను ఆతఁ డంతట నొకనిఁ బిలిచి "ఖుదాబక్షూ! నీ వీయుత్తరమును దీసికొని దక్కనులో నున్న నాపుత్రునిఁ గలిసికొనుము. నాపుత్రుఁ డుత్తరము చూచినవెంటనే బీజపూరునకుఁ బోవును, నీ వాతనివెంటఁ బోయి యాతఁడు సేనాపతులతో మాటలాడి కుట్ర చేయురహస్యముల విని, నీవీవిషకరండము నెట్లో జయసింగునకుఁగాని, లేక నాపుత్రునితోఁ గలియున్నట్టి యితర సేనాపతులకుఁగాని పెట్టి చంపుము. నాతాతను జెఱనిడి యాతని రాజ్యమును నాతండ్రి పరిపాలించెను. నాతండ్రిని జెఱనిడి నేను పరిపాలించుచున్నాను. నన్ను నాపుత్రుఁడు నుద్ధిడుకొనునా? కావున నిప్పటినుండియు మన మేరిని నమ్మక తగిన జాగరూకతతో నుండిన మంచిది కాదా? నీ వీకార్యము నిదివఱకువలెనే నిపుణతతో నొనరించిన నీకు మావలన నమితగౌరవధనలాభములు చేకూరఁగలవు. తెలిసినదా ?" అని చెప్పి తాను వ్రాసినజాబు నాతని కిచ్చిపంపెను.

ఖుదాబక్షు ఉత్తరమును దీసికొని చిత్తమని వంగి సలాముచేసి వెంటనే వెడలిపోయెను.

---

## ఇరువది రెండవ ప్రకరణము.

శివాజీ విడిదిమందిరమున దినములు గడపుచుండెను. దక్కనులో నున్న జయసింగుకడనుండి ప్రత్యుత్తరము రాలేదు. ఇచ్చట శివాజీమందిర మాయుధపాణులగు మహమ్మదీయులచే రక్షింపఁ బడుచుండెను. తన కిది చెఱసాలయా యని శివాజీ తలంచుచుండెను. శివాజీ కేలోపము లేకుండ బాదుషా పరిచారకుల నియమించి సామగ్రు లంపుచుండెను. జయసింగు పుత్త్రుఁడగు రామసింగు ప్రతిదినము వచ్చి శివాజీనిఁ గలిసికొని యాతని కేవిధమైనలోపము లేకుండఁ జూచుచుండెను

వాఁడుక ననుసరించి యొకనాఁడు రామసింగు శివాజీ కడకు వచ్చెను. దక్కనునుండి ప్రత్యుత్తరము రాలేదని యాతఁడు చెప్పెను. "నాకుఁ గొంచెమనారోగ్యముగ నున్నది. మాదేశమునుపోయి యౌషధసేవ యొనరింపవలె" నని శివాజీ చెప్పెను. "చక్రవర్తికడఁ బెక్కుమంది వైద్యు లున్నారీవఱకే చెప్పిన నేవారినిఁ జక్రవర్తితోఁ జెప్పి తీసికొని వచ్చియుందునే" యని రామసింగనెను.

"మన మొకసారి చల్లగాలికి యమునానదీప్రాంతములకుఁ బోవలె"నని శివాజీ యనెను. మంచిదని వారిరువురును బయలు

దేఱిరి. వారివెంట నాయుధపాణులగు భటులు బయలుదేఱిరి. వారిరువురును మాటలాడుకొనుచు నదీప్రాంతములకు వచ్చుసరి కచ్చట ననేకములగు వర్తకులనావలు నదిలోసంచారము చేయుచుండెను. అస్తమయభానుఁడెఱ్ఱనికాంతుల యమునాతోయములపైఁ బ్రతిఫలింపఁజేయుచుండెను. వందలకొలఁదినౌకలు ప్రపంచమునందలి సామగ్రులఁదెచ్చి ఢిల్లీనగరమున దింపుచుండెను. చల్లగాలిచే సేదతీరి నగరపరిసరముల దాఁటు నప్పటికి వారికిరువురు సన్యాసులు కనఁబడిరి. శివాజీ వారినిఁ జూచి రామసింగుతో నిట్లనెను. "సన్యాసులకడ మంచిశక్తు లుండునని విందుము. వీరేమైన నా కారోగ్యము కలిగింపఁగలరేమో? పోయి విచారింతుదము."

రామః—మంచి దట్లే యొనర్పుఁడు.

శివాజీ పిమ్మట వారినిఁ జేరి తనశరీరస్థితి నెఱుకపఱచి యారోగ్యము కలిగింపవలసినదని ప్రార్థించెను. కొంతవడికి వారంగీకరించి మఱునాఁడిదేవేళకు రమ్మని చెప్పి వారు వెడలి పోయిరి. శివాజీ రామసింగులు నాఁటి కిండ్లకుఁ బోయిరి.

ఆసన్యాసులు నిజమైనసన్యాసులు కారు. వారిమాటల వలన నందొకరు రామదాసుస్వామియనియు రెండవసన్యాసి శివాజీపరిచారికయగుగులాబీయనియుఁ దెలియవచ్చెను. వారి యాలోచనము ననుసరించి శివాజీ ప్రతిదినము తనయారోగ్యము నిమిత్తము మధురాహారములఁ జేయించి భవానీమాతకు నివేదన మొనరించి నగరమునందలి ప్రతియింటికిఁ

బంపుచుండెను. ఆనడుమనే శివాజీ మాయచేసి ఢిల్లీనగరము నుండి పాఱిపోవుటకు నిశ్చయించుకొనెను.

ఆతనికి రోషినా రాగలఢిల్లీ విడిచి పెట్టుటకుమాత్ర మిష్టము లేదు.గులాబీని బిలిచి సంగతి చెప్పెను.ఆమె ప్రతిదినమును మాయచేసి సన్న్యాసినివేషమున నంతఃపురమునకుఁ బోయి రోషినా రాతో మాటలాడి వచ్చుచుండెను.తుదకుశివాజీతప్పించుకొనిపోయి యొకసంకేతస్థలమున నుండుటకును, గులాబీతో రోషినా ం॰ మాఱువేషమున వచ్చి చేరుటకు నంగీకరించినదని గులాబీ వచ్చి శివాజీతోఁ జెప్పెను. నియమము ననుసరించి యొకలేఖ వ్రాసి శివాజీ గులాబీచేతి కిచ్చి సంకేతస్థలము నెఱిఁగించి మహమ్మదీయులకన్నులలోఁ గారముకొట్టి తప్పించుకొని వెడలిపోయెను. రేపే ఫాదుషా జన్మదినమగుటచే వారిరువురును దప్పించుకొనుటకు వీలనియు సంకేతస్థలమున రోషినా రాతో వచ్చి కలిసికొందుననియు శివాజీతోఁ జెప్పి గులాబీ యంతఃపురమునకు జాబు తీసికొని వెడలిపోయెను.

---

## ఇరువదిమూఁడవప్రకరణము.

ఈదిన మలంగీరుఫాదుషా జన్మదినోత్సవము. ఆయుత్సవ సందర్భమునాఁడు ఢిల్లీనగరమంతయు కళకళలాడుచుండెను. అంతఃపురములోనికి వెడలుట కేరికి నభ్యంతరము లేదు. అందఱును స్వేచ్ఛగఁ దొందరగఁ దిరుగులాడుచుండిరి అంతఃపురములో నాదినమున వేడుకలు హెచ్చు. ఒకరాణికంటె మఱి

యొకరాణి వేడుక లతిశయముగ పాదుషాగౌరవముకొఱకుఁ జేయుచుండెను. ఆఁడువాం డ్రెవ్వరైన నంతఃపురములోనికి రావచ్చును, పోవచ్చును. నగరవాసులందఱు స్త్రీలచే నాహ్వా నింపఁబడి నగరులోనికిఁ బోవుచుండిరి,వచ్చుచుండిరి. రాజ్యము నందలి వివిధభాగములనుండి సామంతులు స్నేహితులు బంధు వులు ప్రజలుకూడ పాదుషాపుట్టుకదినమున కచ్చటికి వచ్చి యుండిరి. కొందఱు నజరానా లర్పించుటకు, కొందఱు బహు మానము లందుటకు, కొందఱు వేడుకకొఱకు, కొందఱా హ్వానమునంది, కొందఱందక, కొందఱాహ్వానములతో నిమిత్త ము లేకుండ వచ్చియుండిరి.ముఖ్యముగ నీదిన మంతఃపురస్త్రీలకు భోగ్యమైనది.వారు విచ్చలవిడిగఁ బ్రవర్తింపవచ్చును ఇష్టమైన యుత్సవము లొనరించుకొనవచ్చును.అందువలన నిది స్త్రీలకుఁ బర్వదినము. ఆభరణశోభితములగు దుస్తులు ధరించి యందఱు సుఖముగఁ దిరుగుచుండిరి. అత్తరు పన్నీరు మున్నగు పరిమళ ద్రవ్యములతో నూదువత్తులపరిమళము కలిసి చుట్టుప్రక్కల ప్రదేశమంతయుఁ బరిమళవంతమగుచుండెను. స్త్రీలాభరణ ములు హారములు దుస్తులు పువ్వులు రత్నములుఁ బొదిగిన నగలును గొనుచుండిరి.

జనానాలో జరుగుచున్న సంతలో గులాబీకి రోషినారా కనఁబడలేదు.ప్రక్కదొడ్డిలోనికిఁ బోవుసరి కొకపెద్దభవన మా మెకుఁ గాన్పించి ఆ మేడపై షాజహానుతోఁ గలిసి నిలువఁబడి యుత్సవములఁ జూచుచున్న రోషినారాను జూచెను. రోషి నారా గులాబీనిఁ బైకి రమ్మని సన్న చేసెను.

"నీవెచ్చటికిఁ బోవుచున్నావు?" అని రోషినారా యడిగెను.

"నేను కొన్ని బహుమానములు తెచ్చితిని. అవి మీకు గాక మఱియెవ్వరికి?" అని గులాబీ యనెను.

వారిర్వురును షాజహానుతో లోనికిఁ బోయిరి. "ఏమి విశేషము?"లని రోషినారా యడిగెను. గులాబీ వృద్ధునిజూచి సందియపడెను. "భయము లేదు. ఈతఁడు నాతాత. ఆయన కంతయుఁ దెలియును. చెప్పుము." అని రోషినారా పలికెను. గులాబీవిషయ మిట్లు చెప్పసాగెను. "అమ్మా! శివాజీ యీసరికిఁ దప్పించుకొని పాఱిపోయియుండును. ఆతఁ డరణ్యము నడుమ నొకపాడింటిలో మఱుఁగై వేచియుండును. నీవు నాతోఁ దత్క్షణము బయలుదేఱి రావలెను." అని గులాబీ యనెను.

"శివాజీ యేల పాఱిపోయెను?" అని షాజహాను రోషినారా లొక్కమాఱే ప్రశ్నించిరి.

"చక్రవర్తి తనతల తీయించుటకుఁ బ్రయత్నించుచున్నాఁ డని యెఱిఁగి పోయెను." అని గులాబీ ప్రత్యుత్తర మిచ్చెను.

షాజహాను రోషినారాలు తలవంచుకొని నిట్టూర్పులఁ బుచ్చిరి.

"రాకుమారికా! శివాజీ నాకొక లేఖ నిచ్చెను. అది యిదిగో!" అని గులాబీ పైఁటనుండి జాబునుదీసి రోషినారా కొసఁగెను.

రోషినారా యుత్తరమును దీసికొని గులాబీవంకకే చూచుచుండెను. షాజహా నాయుత్తరమును దీసికొని, ముద్ర విప్పి యీవిధముగ౯ జదివెను.

"రోషినారా! హృదయేశ్వరీ!

నిన్నుచూచి యొక యుగమైనది. రాకాసుధాకరబింబమునుబోలు నీముఖమునందలి కిరణములఁ గ్రోలలేక నేఁబొందుచున్నవిచారము నేనెట్లు వర్ణింపఁగలను? నీవు నన్ను గలిసికొనినప్పుడు నీవే నావిచారపరిమాణమును గ్రహింపఁగలవు.

నేను నిన్నుఁబట్టుకొనినాకోటకుఁ దీసికొని పోయినప్పుడు నీయనురాగము సంపాదింపవలెనని కాని నీరూపమునకుఁ గోరిక కలిగి కాని నేనుంపలేదు; కాని నీచంచలకటాక్షములు నాపైఁ బడినప్పటినుండి నేను వానికి వశుఁడనైతిని. ఇంద్రజాలికుని నెమలిపురివలె నీదృష్టి నన్ను నిశ్చేష్టితు నొనరించినదిమొదలు, నామన సొకవిధముగ మాఱిపోయినది. నీ యాకృతి నాహృదయమునఁజిత్రింపఁబడినది.యువకులహృదయములకు యువతులు సంతోషమును గలిగించెదరని పెద్దలందురు. ఈవిచిత్రమేమి? నీవు—నీరూపము నగ్నిశిఖవలె నాహృదయమునఁ దవిలి నాచెకుముకివంటి హృదయమును గరగివేయుచున్నది.

మనోహారిణీ! ప్రియాంగనా! నీసంతోషమునకై నే చేయని ప్రయత్నము లేదు కదా! మందహాసరుచులతో నీ పెదవులఁ దాండవింపఁజేయుచు నీవే స్వేచ్ఛగ మాటలాడక నన్ను వేధించితివి కాని నేను నీకనుబొమల వంకరనైన నెదిరించి

రెఱుఁగను. మీతండ్రికిఁ గోపమువచ్చునని నీవు సందియ మొందితివి. తుద కాతనికోపాగ్ని నే చిక్కుకొంటివి కదా!

ఐనఁ గడచిపోయినవిషయములఁ ద్రవ్వనేల? ప్రాణనాయకీ! నేను నీకై నాసర్వస్వమును విడువఁ దీర్మానించుకొంటిని. నాకు నీవు తప్ప నేమియు నక్కఱలేదు. కావున నన్ను బ్రతికించుటకు నీదివ్యదర్శనము నొసఁగఁగోరుచుంటిని.

నీజనకుని సైనికులు నాదుర్గమును ముట్టడించిననాఁడు—ఆనాఁడు—నేను నీకడకుఁ బరుగెత్తుకొని వచ్చి నీకడ నేడ్చితిని. నీవప్పుడు నాతోననిన ధైర్యవాక్యము లిప్పటికి నాశ్రవణకుహరములఁ బ్రతిధ్వనించి సంగీతముఁ బాడుచున్నవి. నేను జీవించి యుండుట కాసంగీతమే కారణము.

నేనిక్కడఁ దగులొకొనిన కష్టముల నీవు గ్రహించియుందువు. అదియేమియో కాని నేఁడు నాకెద్దియో కష్టమావరించినట్లున్నది. మరణమువచ్చునని భీతికలుగుచున్నది. ఈకష్టశకునములవలన నేఁ బాఱిపోయితిని. గులాబీ సంకేతస్థలమునకు నిన్ను తీసికొని వచ్చును.

నీవు నన్ను విడువవని ధైర్యముగనున్నది. అట్లు కానియెడ నేను నీకష్టజీవితమును ముగించెదనని నమ్ముము. ఏమనగాః ఇఁక నే బ్రతికిన ప్రయోజనము లేదు. నీవులేని యీజీవితమున కేమి ఫలము? ముందు జన్మమునందైన నేను నిన్ను గలిసికొని నిన్ను నా ప్రియసఖివని పట్టుకొని సుఖింపఁగలను. నేనిప్పుడు నీవిరహాసముద్రమున మునిఁగిన నా కాముందాసయే నావయగుఁగాక.

నీతండ్రి నన్నుఁ జంపవలెనని యాలోచించుచున్నట్లు తెలిసికొంటిని. నేను నాప్రాణములఁ బరిత్యజించెదను. కాని నీతండ్రి యాజ్ఞచే నేనుమరణింపను. నేను మరణింపవలసిన యెడల నింతకంటె మంచితావున నీకొఱకు స్వతంత్రముగ మరణించెదను.

ఇంతకంటె వ్రాయుటకుఁ గాలములేదు. నేను నిన్నుకలిసికొనినప్పు డనేకవిషయములు ముచ్చటించుకొందము గులాబీతో వెంటనే రమ్ము!

నీప్రియుఁడు,
శివాజీ"

"నీ విప్పుడు గులాబీతో వెడలిపొమ్ము! కాని నేచెప్పినది మఱవకుము" అని విచారస్వరమున షాజహాను త్తరముముగించి రోషినారాతో ననెను. రోషినారా కన్నీరు వఱదలగుచుండెను. ఆమె ప్రత్యుత్తర మీయలేదు.

"నీ వెందులకేడ్చెదవు?" అని షాజహా నడిగి "నీ వీవని తతోఁ బొమ్ము. ఈనాఁ డేవరు నిన్నుప్రశ్నింపరు" అనెను.

"నేను పోఁజాలను." అని రోషినారా పలికి కన్నుల నీరునింపెను.

వారిరువురు నాశ్చర్యపడిరి.

"ఏల? నీ వీవఱకు మాఱువేషములఁ బరువెత్తఁదలంచిన దాన వేలపోఁజాలవు." అని షాజహా నడిగెను.

"కర్మసూత్రము నేరు దాఁటఁగలరు?" అని స్వప్నము నుండి లేచినవారివలె రోషినారా పలికెను.

ఇట్లు చెప్పి గులాబీని తనవెంటరమ్మని లోపల మఱియొక గదిలోనికిఁ బోయి యామె కొకలేఖ వ్రాసి యిచ్చి, "నాతండ్రి వ్యాకులపడుట నాకిష్టములేదు—గులాబీ! ఈయుత్తరమును దీసికొనిపోయి నాహృదయేశ్వరుని కిమ్ము! నాప్రియుఁడు సురక్షితముగఁ దనదేశము చేరునట్లు సాయపడుము నీకిదే బహుమాన" మని తనపఱుపు క్రిందనున్న యొకవిలువయైన మంచిముత్యాల హారము నామె కిచ్చి పంపివేసెను. గులాబీ మాటలాడలేక పోయెను. పొంగివచ్చుచున్న కన్నీటితో నామె రోషీనారాకడ సెలవుతీసికొనెను. రోషినారా కన్నీటిజలములో మునిఁగి పడి పోయెను.

---

## ఇరువదినాల్గవ ప్రకరణము.

తనజన్మదినోత్సవమునాఁ డౌరంగజీబు కొలువులో సింహాసనముపైఁ గూరుచుండియుండెను. ఆతని కిరుకెలంకుల ననేకోద్యోగులు, ప్రభువులు, సామంతులు నుండిరి. సైనికులు, సర్దారులు రాజకుమారులు దూతలు నాగరికులు నెన్నియో బంగరు వెండివస్తువులఫాదుషాకు బహుమానముగ సమర్పించుచుండిరి. వేశ్యలు, సంగీతపాఠకులు, వినోదకరులు, ఆటకాండ్రు, వైణికాది జంత్రవాద్య మొనరించువారు, నందఱో పాడుచుండిరి. ఆడుచుండిరి. కొందఱు భుజములవఱకు భుజియించుచుండిరి. కొందఱాపైనఁ ద్రావుచుండిరి. కొందఱు తినఁగా మిగిలినవి బీదలకై

విరాజిమ్ముచుండిరి. కొనుట, అమ్ముట, ఇచ్చుట, పుచ్చుకొనుట, తినుట, త్రాగుట యీపని లెటుచూచిన నగపడుచుండెను.

షాజహాను రోషినారా లిరువురుతక్క నానాఁడు ఢిల్లీనగరమునందలి ప్రతిప్రాణియు సుఖసముద్రమునఁ దేలియాడుచుంటినని సంతసించుచుండెను. సాయంకాలము సమీపించుచుండెను. ఆచారము ననుసరించి యాసమయమున సుల్తాను తులాభారముతూగి బంగరువెండినగల నెందఱకో పంచియిప్పించెను. జన్మదినమునాఁడైన నింతయుదారముగ నుండెకదా యనిఘాదుషాశత్రువులుకూడఁ దలంచుచుండిరి. ఇతరదర్బారుమర్యాదలు ముగించి సింహాసనము నెక్కి కూరుచుండఁగా నింతలో దక్కనునుండి యొకవార్తాహరుఁడు ప్రవేశించి ఘాదుషాకు వంగి సలాముచేసి యొకయుత్తరము నాతనియెదుట బల్లమీఁద నుంచెను. అది తీసికొని చదివి చక్రవర్తి "కొత్వాల్!" అని యఱచెను.భీకరాకారుఁ డొకఁడచ్చటఁ బ్రవేశించెను. అందఱు గడగడ వణఁకుచుండిరి. చక్రవర్తి కొత్వాలును జూచి "నీవే పోయి వెంటనే శివాజీ శిరమును దీసికొనివచ్చి చూపుము"అని యాజ్ఞాపించెను.

"చిత్తము—" అని చేతులు కట్టుకొని యాతఁడు క్రిందికే చూచుచు వెనుకకుఁ దిరుగకుండ నిష్క్రమించెను.

ఈయాజ్ఞ ఘాదుషా పెదవుల దాఁటుట తడవుగాఁ గొత్వాలుతో ననేకులు సభనుండి శివాజీని నఱకుట చూడవలెనని పోయిరి."అహా! రాజస మేమి చేయింపలేదు?చరిత్రపుటలఁ ద్రిప్పి

నచోఁ దమకున్న శత్రుత్వమునకో - మతాభిప్రాయ భేదమునకో - వారసత్వపు కారణమునకో - స్వలాభమునకో - రాజ్యవిస్తీర్ణతకో - నఱకఁబడినతల లెన్నికనుపించును? అధికారము పేరున - రాజ్యాధికారగర్వమున - గడ్డిపఱకలవలెఁ బరుల ప్రాణము లెన్ని నశించినవో!" అని కొందఱు సజ్జను లూహించిరి. "హిందూ రాజ్యమిఁక సరి!" అని కొందఱనుకొనిరి. "విధిప్రేరితమని వెఱ్ఱి వేదాంతపుముక్క నొక్కరనిరి.

కొత్వాలు వెళ్లినపిమ్మట సభ్యు లట్లు తలంచుచుండ ఫాదుషా యీవిధముగఁ దలపోయఁదొడఁగెను. ఇంక నేమున్నది? నాకోర్కులు సిద్ధించినవి. భానుఁడిక నాశత్రువును గనుఁగొనలేఁడు నాపైఁ దిరుగుటకుఁ బ్రయత్నించినజయసింగు పెండ్లి యైపోయినదికద! ఇఁక నాతఁడు లేఁడు. ఇతరు లందఱు నణఁగిపోయిరి. నాపుత్త్రునియందు నాపై దండెత్తఁ దలంచినందులకు విశ్వాసము నశించినది. ప్రజలు సైనికులు నాతని నమ్మరు. ఈసరికి శివాజీశిరచ్ఛేద మైయుండు ననుకొనియెదను. ప్రజ లనేకవిధములఁ బ్రయత్నింపనిమ్ము. తుదకు నాపంతమే నెగ్గును." అని సంతోషాంబుధినిఁ దేలియాడుచుఁ జక్రవర్తి యూహించుకొనుచుండెను. ఇంతలోఁ గొత్వాలు వచ్చి చక్రవర్తికి సాష్టాంగ మొనరించెను. ఏదియో కొంప మునిఁగినదని తలంచి "ఏది శివాజీశిరము?" అని ప్రశ్నించెను. కొత్వాలు లేచి "చిత్త...ము" అని తడవుకొనుచుండ "ఏమైనది?" అని చక్రవర్తి గర్జించెను. "చిత్తము___ఘోరావాంధ్రు తిని త్రాగి___"

"శివాజీ తప్పించుకొనెనా?" అని చక్రవర్తి డిల్లపోయెను.

కొత్వాలు గజగజవణంకుచు మిఠాయిగంపలలోఁ గూరు చుండి యాతఁడు తప్పించుకొనిపోయినయుదంతము నెఱుక పఱచెను.

"శివాజీని బట్టుకొని తీరవలెను. మనుష్యుల నంపుఁడు. లేకుండిన మానప్రాణములు దక్కవు" అని చక్రవర్తి యాజ్ఞా పించెను. పలువురు సైనికులు పదివైపులకును బరుఁగులెత్తిరి. తప్పించుకొనిపోయిన శివాజీని పట్టుకొనుట యంతసులభ కార్యమా?"

గులాబీ యుచితకాలమున నట్టడవిలోనున్న శివాజీనిఁ గలసికొనెను. "రోషినారా ఏది?" అని శివాజీ యడిగెను. గులాబీ లేఖ నందించెను. ఇంకను రోషిన వచ్చునసెడి యాస తో శివాజీ చదువుకొనసాగెను. అం దిట్లున్నది.

"శ్రీమహారాష్ట్రవీరుఁడై చెలఁగుచుండు
శ్రీశివాజీమహారాజుచెంత కిదియె
ప్రాణసఖి యగురోషిన పంపుచునది
... ... ... ...
ప్రణయరసపూరితంబునీప్రణయ రేఖ
గన్నులకు నద్దుకొని చూచి కడుపగచితి
మాటమాటకుఁ గన్నీరు లూటలూర

బందిలోనుండి చదివితిఁ బదముపదము
బయటనుండిన సుఖము చేపట్టియుండు
నేను బొందెడు బాధచే నెఱుఁగఁగలను
నీదుమనమును వేఁచెడు వేదనములఁ
గాని నీవును నేనును గారకులము
కాము మనదుఃఖములనెల్ల కర్మ తెచ్చె
కర్మనే తిట్ట సుఖమింత కలుగునేమొ!
నిన్నుఁ జేరఁగలేనని నేను మిగుల
వగలఁ బొగిలితి రానని సెగలఁబడకు
కారణములుండె నేరాని కార్యమునకు
నైన ధీరతనేనిట్టు లైతిననుచుఁ
దలఁపఁబోకుము నేను నిర్దయతఁ బూని
తనుచు నీ వెంచఁబోకుమీ మనమునందు
నేను నినుజేర నాతండ్రి యేడ్చుచుండుఁ
గుందుఁ గూఁతురు కులమును గూల్చె ననుచు
రాజు నేడ్పించె రోషిన రాలుగాయ
యనుచుఁ దల్లులు దిట్టెద రనవరతము
కావునను రాక మానితిఁ గరుణఁ జూడు!
... ... ... ...
నాకొఱకు నీకు వేదన లేకపోదు
నీవు బాధల నొందుట నిజము నిజము!
ఐన నొక్కటి చెప్పెద నైహికమున
నీదుప్రియసఖి రోషిన లేదటంచు

మరణమును బొంది పరలోక మరిగె ననుచుఁ
దలఁచి శాంతిని బొందుము ధైర్యమూర్తి!

... ... ... ...

ఏఁగు మింటికి వేగమే యేఁగు మయ్య!
చక్రవర్తియు నీయెడఁ జలముఁ బూనెఁ
జేతికందినఁ జంపఁగఁ జేయు నతఁడు
నెట్టులైనను జంపఁగఁ బట్టుపట్టె;
నేఁగు మింటికి వేగమె యేఁగు మయ్య!
అచట నీప్రజ నీకయి యడలుచుండు
వారిపై నీకృపావర్షధార లంపి
సౌఖ్యజీవన మీయఁగ సాగిపొమ్ము
రాజవై యేలుకొను రామరాజ్యముగను
నీవు లేనట్టిప్రజ భీతి నెగడకుండుఁ
బొమ్ము వారల వేగమె ప్రోవుమయ్య!

... ... ... ...

ధరణి నెందఱు లేరు సౌందర్యవతులు
నన్నుఁ దలఁదన్ను వారల నెన్నఁగలవు
తురకబాలికఁ బెండ్లాడి పరులచేత
హేయమతిఁ జూడఁబడ నేల హిందువుఁడవు
పరమసౌందర్యమూర్తినిఁ బరిణయమయి
రాజ్యసుఖములనొందుము రాజరాజ
నిన్ను వేఁడెద వేగమె నన్నుమఱువు

మిదియె నేఁగోరు తుదికోర్కె సదయహృదయ
మనచిరస్నేహ మూహించి మఱచిపొమ్ము!

... ... ... ...

నాకొఱకు నీవు దుఃఖింప న్యాయమేమి?
నీకొఱకు నేను పరిణయనియతి మాని
కన్యనై యుందు నీజన్మఁ గడపుచుందు
నిన్ను ధ్యానించి మదిలోన నిఖిలసుఖము
లొందఁ జూచెద నీవేల కుందవలయు
నాకొఱకుఁ దలఁపుమ ప్రాణనాథ నీవు
పురుషుఁడవు నీవు ధైర్యంబుఁబూనకున్న
నబలనగునాదు దినము లెట్లరుగునయ్య?
కర్మసూత్రంబు నెవ్వరు గడచినారు
విధివిధానంబుమీఱిన వీలు కలదె?

... ... ... ...

మఱచిపొమ్మయ్య నన్నిఁక మఱవుమయ్య
స్మృతిపథంబున నన్నిఁకఁ జెదరఁగొట్టి
క్రూరురాలిని నీమూర్తిఁ గూడలేని
వజ్రహృదయంబుగలనన్ను వదలివేసి
కఱకుఁదురకలబిడ్డ న న్మఱచిపొమ్ము!

... ... ... ...

వ్రాయుటకు నేమి కల దింక వ్రాయలేను
నీవు సర్వజ్ఞుఁడవు వేఱ నీకు వ్రాయఁ
బడఁతి పూనుట తప్పగుఁ బ్రాణమిత్ర!

సెలవ యీజన్మమున? కింక సెలవు సెలవు!
రోషమూనకు మన్నింపు!—

రోషినార."

ఉత్తరమును ముగించి శివాజీ హతాశుఁడయ్యెను. ఆతనికి రోషినారా లేని ప్రపంచము శూన్యముగఁ గన్పట్టెను. ఒక్క పెద్దనిట్టూర్పును విడిచెను. గులాబీవైపునకుఁ జూచి "ఏమిది? ఇట్లు చేసికొని వచ్చితివి?" అని ప్రశ్నించెను. గులాబీ కన్నీళ్లతో జరిగినసంగతు లన్నియుఁ జెప్పుచుండెను. అది వినుచు శివాజీ యాఁడుదానివలె నేడ్చుచుండెను. "అయ్యో! గతజల సేతుబంధ మేల? శత్రురాజ్యము విడిచి పోవలదా?" అనెను.

"ఇఁక నారోషినారా లేదా?" అని శివాజీ యేడ్చెను ఆఁచీకటితో నిండియున్న యరణ్యమున వా రేమైనది యింకను దెలియలేదు.

సమాప్తము.



చెన్నపురి: వావిళ్ల. రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము. 1930.

# ఆంధ్ర గ్రంథములు.

## వచనము.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్ర వచనభాగవతము, ద్వాదశస్కంధములు, శ్రీ శతఘంటము. వేంకటరంగశాస్త్రికృతము ... | 6- | 8 |
| డిటో 3 వాల్యములు ,, ... | 7 | 0 |
| సంగ్రహరామాయణము, శ్రీ శేషాద్రి శర్మకృతము. ... | 0 | 10 |
| సంస్కృతనాటకకథలు, శ్రీ సీతారామశాస్త్రికృతము ... | 1 | 4 |
| దశకుమారచరిత్రము, శ్రీ ఎనమచింతల. సంజీవరాయ శాస్త్రికృతము ... | 1 | 8 |
| శివాజీచరిత్ర ... | 0 | 8 |
| శ్రీ రామానుజాచార్యచరిత్ర ... | 0 | 2 |
| శ్రీ శంకరాచార్యచరిత్ర,—ప్రతిమతో ... | 0 | 3 |
| రామకృష్ణపరమహంసచరిత్ర ,, ... | 0 | 3 |
| శ్రీ వేమనయోగిజీవితము ,, ... | 0 | 4 |
| బాలగంగాధరతిలకుగారిచరిత్ర ,, ... | 0 | 4 |
| దాదాభాయినౌరోజీచరిత్ర ,, ... | 0 | 2 |
| శ్రీ కరంచంద్ గంధిజీవితము ,, ... | 0 | 4 |
| శ్రీ గైక్వారుగారిజీవితము ,, ... | 0 | 2 |
| శ్రీ లాలాజ్ పతిరాయజీవితము ,, ... | 0 | 2 |
| శ్రీ గోపాలకృష్ణ గోఖ్లేజీవితము ,, ... | 0 | 2 |
| అనిబిసెంటుచరిత్ర, ప్రతిమతో ... | 0 | 4 |
| శ్రీ రానడే జీవితము ,, ... | 0 | 2. |
| వివేకానందస్వామి జీవితము ,, ... | 0 | 2 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి. ఈ.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| శ్రీకృష్ణదేవరాయచరిత్ర, ప్రతిమతో | ... | 0 | 3 |
| స్వామిరామతీర్థజీవితము | ... | 0 | 2 |
| శాలివాహనచరిత్ర | ... | 0 | 3 |
| శ్రీబుద్ధచరిత్రము | ... | 0 | 4 |
| సోదరీనివేదితజీవితము | ... | 0 | 2 |
| సూరతుకాంగ్రెస్సు ఉపన్యాసములు | ... | 0 | 2 |
| శ్రీగైక్వారుగారి ఉపన్యాసములు | ... | 0 | 2 |
| శ్రీమహాభక్తవిజయము | ... | 4 | 0 |
| దక్కనుపూర్వకథలు, శ్రీసీతారామశాస్త్రికృతము | ... | 1 | 8 |
| భోజకాళిదాసకథలు, 1-వ భాగము | ... | 0 | 12 |
| డిటో 2-వ భాగము | (అచ్చగుచున్నది). | | |
| మైరావణచరిత్ర, చక్కనికూర్పు | ... | 0 | 1 |
| రేచుక్కపగటిచుక్కకథలు ,, | ... | 0 | 3 |
| విక్రమార్కునికథలు | ... | 0 | 8 |
| బేతాళునికథలు | ... | 0 | 8 |
| భారతరమణీమణులు | ... | 0 | 12 |
| డిటో రెండవభాగము | | 0 | 8 |
| మర్యాదరామన్నకథలు | ... | 0 | 2 |
| పరమానందశిష్యులకథలు | ... | 0 | 3 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | ... | 0 | 4 |
| తాతాచార్యులకథలు | ... | 0 | 6 |
| నలుగురుమంత్రులకథలు | ... | 0 | 4 |
| అయిదుగురుదొంగలకథ | ... | 0 | 4 |
| మదనకామరాజుకథలు, చక్కనికూర్పు | | 0 | 14 |
| సత్యసేనవిజయము, శ్రీ కో. అనంతాచార్యకృతము | ... | 0 | 4 |
| షేక్స్పియర్ నాటకకథలు, సులభశైలి | ... | 1 | 8 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అరేబియన్ నైట్సుకథలు, చక్కనికూర్పు | ... | 1 | 4 |
| ఈసబునీతికథలు, క్రొత్తకూర్పు 1-వ భాగము | ... | 0 | 6 |
| డిటో 2-వ భాగము | ... | 0 | 8 |
| ప్రహ్యాకథలు | ... | 0 | 12 |
| లార్డుక్లైవు జీవితము | ... | 0 | 8 |
| శ్రీగురుజాడ. శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవిజీవితములు | ... | 3 | 8 |
| తారాబాయి, చక్కనినవల, క్రొత్తకూర్పు | ... | 0 | 12 |
| ఆనందమఠ, నవల, నూతనముద్రితము | ... | 0 | 12 |
| కపాలకుండల, నవల ,, | ... | 0 | 14 |
| దుర్గేశనందని ,, | ... | 0 | 8 |
| ఐవన్హో, నవల, క్రొత్తకూర్పు | ... | 0 | 8 |
| మదాలస ,, | ... | 0 | 10 |
| సుజనరంజని ,, | ... | 0 | 8 |
| మనోహర, నవల, టి. యస్. రామశాస్త్రిగారిది | ... | 0 | 14 |
| టిప్పుసుల్తాన్, నూతనకవితాశైలిని అక్కిరాజు. ఉమాకాంతము గారిచే విరచితము | ... | 1 | 4 |
| సీతారామము, తల్లాప్రగడ.సూర్యనారాయణరావుగారిది | ... | 1 | 8 |
| రాజర్షి, శ్రీరవీంద్రనాథఠాకూర్ గారి బంగాలీ నవలకు తెనుఁగు. ఇట్టినవల ఈవఱకచ్చుకాలేదనియే చెప్పవచ్చును. అత్యద్భుతమైన పీఠిక, శ్రీఠాకూరుగారి జీవితము ఇందున్నవి. | ... | 0 | 14 |
| ఉన్మాదిని, నవల | ... | 0 | 4 |
| రాధారాణి ,, | ... | 0 | 4 |
| లీల ,, | ... | 0 | 4 |
| రోషినార ,, | ... | 0 | 12 |
| లాలాభాయి ,, | ... | 0 | 8 |
| నీతిచంద్రిక, చిన్నయసూరిగారిది | ... | 0 | 6 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| పంచతంత్రము, వచనము, సులభశైలి ... | 0 | 6 |
| క్షేత్రయ్యపదములు, చక్కనికూర్పు ... | 0 | 14 |
| రామదాసచరిత్ర, చక్కనికూర్పు, మంచికాగితములు, ఇందు శ్రీరామదాసుగారి ప్రతిమకూడ కలదు. ... | 0 | 12 |
| అద్వైతసంగ్రహము, వచనము ... | 0 | 2 |
| వాసుదేవమననము, వచనము, మంచిఅచ్చు ... | 0 | 12 |
| వెంకయ్యవ్యాకరణము ... | 0 | 4 |
| బాలవ్యాకరణము, చిన్నయసూరిగారిది ... | 0 | 12 |
| శబ్దార్థచంద్రిక, శ్రీమహాకాళి. సుబ్బారాయకృత ఆంధ్రనిఘంటువు | 2 | 4 |
| తెనుఁగుసమస్యలు ... | 2 | 2 |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు (క్రొత్తగ ననేకచాటువులు చేర్పఁబడినవి.) మొదటిభాగము ... | 1 | 4 |
| శ్రీవివేకానందవిజయము ... | 1 | 12 |
| ఆంధ్ర కన్నడబాలశిక్ష ... | 0 | 3 |
| ఆంధ్రద్రవిడబాలశిక్ష, అరవ మభ్యసింపఁదలఁచు ఆంధ్రులకు మిక్కిలి యుపయోగము ... | 0 | 3 |
| తెనుఁగుసామెతలు, ఇంగ్లీషుసామెతలు, తర్జుమాతోసహా ... | 1 | 0 |
| పాకశాస్త్రము, శ్రీ కంది సుబ్బారావు బి. ఏ. గారిది ... | 1 | 8 |
| పెద్దబాలశిక్ష, నూతనముద్రితము ... | 0 | 8 |
| పెద్దబాలశిక్ష, మేలుకాగితములు ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు ... | 1 | 0 |
| హఠయోగప్రదీపిక, యోగాభ్యాసదర్పణము యోగాసనపటములతో నూతనముద్రణము ... | 2 | 8 |

2.1.53 Rs 1-0-0

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
192, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ